# సోమసుందర్ కృతులు

వజ్రాయుధం [కావ్యాలు]

బానిసల దేశం [కథలు]

రక్తాక్షి [కావ్యాలు]

కాలం జాడలు [చిత్రికలు]

జీవిత రేఖలు [ఉత్తరాలు]

ఆంధ్ర
అభ్యుదయ రచయితల సంఘం
తరఫున

ఎర్నస్ట్ టాలర్

# మందీ-మనిషి

సోమసుందర్

[ఇరవయ్యో శతాబ్దపు సామాజిక విప్లవ కుసుమం]

శామల్‌కోట

కళాకేళీ ప్రచురణలు.

రాజమండ్రి

## సోమసుందర్ కృతులు

వజ్రాయుధం [కావ్యాలు]

బానిసల దేశం [కథలు]

రక్తాక్షి [కావ్యాలు]

కాలం జాడలు [చిత్రికలు]

జీవిత రేఖలు [ఉత్తరాలు]

ఆంధ్ర

అభ్యుదయ రచయితల సంఘం

తరఫున

ఎర్నెస్ట్ టాలర్

# మందీ-మనిషి

సోమసుందర్



[ఇరవయ్యో శతాబ్దపు సామాజిక విప్లవ కుసుమం]

శామల్‌కోట

కళా కేళీ ప్రచురణలు.

రాజమండ్రి

తెలంగాణా శ్రామికులకు....



జగత్ క్రాంతి! జగత్ క్రాంతి!
నవజీవన మాతృమూర్తి!
నవశక్తి విధాతృకీర్తి!
జగత్ క్రాంతి—మాతృమూర్తి.
నవమానవ జన్మభూమి
నవవిధాన ప్రగతిగామి—
జగత్‌క్రాంతి మాతృమూర్తి!
జ్వలిస్తుంది అరుణకాంతి
ప్రాయశ్చిత్తపు నెత్తుట
ఈ తరాన గతయుగాన
ప్రళయజలధి ఉద్భృతాన
వటపత్రపు దోలికపై హసిస్తుంది మరో ధాత్రి!



# అంకితం:

ఆంధ్రీకరణకి అవకాశమూ ప్రోత్సాహమూ కల్పించిన
శ్రీయుత కొప్పరపు సుబ్బారావు గారికీ
శ్రీమతి సరోజినీదేవి గారికీ
గౌరవ పురస్కారంగా.

—సోమసుందర్

# పుస్తక పరిచయం....

ఈపుస్తకాన్ని వ్రాసినవారు ఎర్నస్ట్‌టాలర్ అనే జర్మన్ రచయిత. ఈయన జర్మనీలోని సమోచిన్‌లో 1893 లో జన్మించాడు. స్వతహాగా అతివాది. 1919 వ సంవత్సరంలో మ్యూనిచ్ నగరంలో కమ్యూనిష్టు. పాసిఫిస్టు పక్షాల నాయకుడై కొన్ని ప్రదర్శనల జరిపించాడు. దాని ఫలితంగా ఈయన నీడర్‌షాన్‌ఫీల్డు కోటలో బంధింపబడ్డాడు. అక్కడే ఆయన ఎన్నో సామాజిక ఇతివృత్తాల్ని తీసుకొని 'ఎక్స్‌ప్రెషనిష్టిక్' శైలిలో ఎన్నో నాటకాల్ని రచించాడు. అందులో 'మందీ-మనిషీ' ఒకటి.

'మందీ—మనిషీ' అనే ఈ లోకోత్తర కావ్యనాటకం అక్టోబర్ 1919 లో వ్రాయబడింది. అక్టోబర్ 1921 లో, అనగా సుమారు రెండేళ్లకు, తొలిసారి నాటకరంగాన్ని అలంకరించింది. ఆ ప్రదర్శనానికి నిర్మాత, దర్శకుడు జూర్గన్ ఫెహ్లింగ్.

ఈ నాటకంలో మొత్తం ఏడు చిత్రా లున్నాయి. వాటిలో ఏ ఒక్కటీ వాస్తవిక చిత్రం కాదు. అన్నీ దార్శనిక పరిసరాలలో కదిలే స్వాప్నికచిత్రాలే. ఆవిధమైన వాస్తవికత ఇందులో స్పష్టంగా కనిపిస్తుంది. రచయిత మాటల్లో........

"ఈ వాస్తవిక చిత్రాలు వాస్తవికత్వ చిత్రాలు కావు: సర్వసామాన్యమైనవి కూడా కావు; ఒక్క సోనియాకి తప్ప ఏ యితర పాత్రకీ ప్రత్యేక వ్యక్తిత్వంగాని, ప్రత్యేక లక్షణాలుగాని, స్వభావంగాని లేవు. అలాంటి నాటకానికి ఆధ్యాత్మిక వాస్తవికత తప్ప భౌతిక వాస్తవికత ఉండదు.

"నారాజకీయ సంస్కృతి కనుగుణంగానే నారచన సాగించాను. మానవప్రాణుల మధ్య కనిపించే కొన్ని ప్రత్యేక సంబంధాలే పరాత్మక సంబంధాలనీ, ప్రమాణాలు, సమూ

హాలు, విభిన్న సామాజిక శక్తుల ప్రాతినిధ్యాలు, విభిన్న ఆర్థిక విధులూ మాత్రమే వాస్తవిక మైనవనీ నా నమ్మకం. ఈ సత్యాల విలువని, కళాకారుడిగా పృచ్ఛించవలసిన బాధ్యత కూడా నాదేనని గ్రహించాను. [మన ఉనికి వ్యష్టిరూపంలోనే ఉన్నదా అనేది నిర్ణయించవలసిన ప్రశ్న.]"

జైలు: దాని ఆవరణలో బందీలు బండదుంగల్ని రంపాలతో కోయటం; ఒకే లయ; ఒకే శ్రుతి; ఒకే మూల్గు; రచయితకు గుండె కలిగింది :

"అవును; వీళ్లే మనుష్యులు." అనుకున్నాడు.

"ఇతను కార్మికుడే కావచ్చు; అతను వ్యవసాయ కూలీ; ఇంకొకడు గుమస్తా....కార్మికుల పేటల్ని నేనెరుగుదును. అతని ప్రత్యేక లక్షణాలు—అగ్గిపెట్టి విసరటంలో, ఆడదాన్ని ముద్దు పెట్టుకోవటంలో, సాయంత్రం కర్మాగారాల గేటుల్ని దాటి రావటంలో—నడకలో, ముఖ కవళికలో— అంతా ఒక ప్రత్యేకత. విశాలమైన వెన్నూ, పట్టెడు జబ్బా ఉన్న రైతూ, పిడికెడు చాతీ, గుంటలుపడ్డ కళ్లూగల గుమస్తా కనిపిస్తారు స్పష్టంగా నాకు. నిదానించి చూస్తాను. మళ్ళీ మానవులా పీనుగులా అనిపిస్తారు. 'క' గాని, 'చ' గాని, 'ట' గాని— ఎవరైనా అంతే. బాగా నిదానించి చూస్తాను. వాళ్ళని పాలిస్తున్న విధీ, తన భయంకర మృత్యుగహ్వరాన్ని తెరుచుకొని మ్రింగబోతున్న విధీ. దానిని తెలుసుకొనీ తెలుసుకోలేక కొట్టుమిట్లాడే కొయ్యలుగా చేటపెయ్యలుగా, జీవచ్ఛవాలుగా వాళ్లూ....

"ఒక్క క్షణం—కనీసం ఒక్క క్షణమన్నా — వీళ్ళని 'వాస్తవ మానవప్రాణులు' గా ఆ 'వాస్తవ' చెరసాలలో

చూడలేకపోయాను. మృత్యువు వికటాట్టహాసాలు, దాని భయంకర నృత్యవిన్యాసాలు మాత్రమే నా కళ్ళముందు అవతరించేవి."

మొత్తంమీద 'మందీ-మనిషీ' ఇలాంటి దార్శనిక అంతర్దృష్టి మాత్రమే. రెండున్నర రోజుల పురిటినొప్పి ఈ రూపంలో ఫలించింది రచయితకు. చీకట్లో, కొట్లో, రెండు రాత్రింబవళ్ళు భయంకర మరణ వేదన. ఆవేదనలో వికృత వికటాట్టహాసాల ముఖాలు వెక్కిరించి, ఝళిపించి, గోంద్రించి, వణికించినయ్ అతన్ని. రెండు ఉదయాలు భయాలతో, ఉరకలెత్తే జ్వరంతో ప్రకంపించే శరీరం! కూర్చుని కలం విదళిస్తే జరజరా పరిగెత్తే ఆగనివ్రేళ్లు!—జారుతూ గజగజ వణికే వ్రేళ్లు: శరీరం, వ్రేళ్లూ అతని అదుపాజ్ఞలు తప్పిపోయాయి. ఖైదీ గదిని ఊడ్చ టానికన్నా ఎవరూ రాలేదు: ఖైదీ రానివ్వలేదు. కొత్త ఖైదీ కటకటాల చుట్టూ నిత్యం నృత్యంచేసే తోటిఖైదీలు—కనిపిస్తే చాలు మీదపడి కరవ బోయేవాడు.

తన ఆనంద స్వరూపాన్ని, తన రెణ్ణాళ్ల పురిటిబిడ్డను ఒక సంవత్సరం పాటు తుడుపులతో సవరింపులతో అలంకరించాడు. అదే ఈ

మందీ — మనిషి.

"ఇవాళ ఈ బిడ్డని వైమర్శిక దృష్టితో చూడగలను. ఆ రోజుల నా అంతరంగిక మధనలో ఇది జన్మించిందని నాకు తెలుసు. నా వ్యక్తిగత రహస్యాల నన్నీ ముడిగా, ఉన్నదున్నట్టుగా, నగ్నంగా చెప్పే నా నిష్కల్మషత్వమే నా బిడ్డ సౌందర్యాన్ని భగ్నంచేసి ఉంటుంది. కళని స్వచ్ఛమైన పరాత్మక దృష్టిలో చూడటం ఇంకా సాధ్యంకాని ఆ రోజుల్లో నా నిష్కల్మషత్వమే నా అనుభవాలు రససిద్ధి

పొందకుండా అడ్డుపడిందేమో! విప్లవ పుడియుల ఉధృత మనే గ్రహణంవల్లనే నా మానసిక చిత్రానికి తొర్రి వచ్చి ఉంటుంది. అయినా నేటికీ నాలో ఒక విధమైన బాధాకర ఆధ్యాత్మిక క్లిష్టసమస్యగా ఆ అనుభూతి మిగిలిపోయింది."

అక్టోబర్ 1921.

వాస్తవాన్నీ, స్వప్నాన్నీ—విడదీయులేని గందరగోళం ఈ రచనలో ఉందేమోనని కొందరు విమర్శకులు అనుమానపడ్డారు. ఆ విమర్శకులకు ఈ రచనని అర్థం చేసుకోగల బుద్ధికుశలత లేకపోయిందని రచయిత చాలా నొచ్చుకున్నాడు :

"ఏమైనా, శ్రామిక కుటుంబానికి అతి సన్నిహితంగా బ్రతుకుతూ, వారి ఆధ్యాత్మిక మూల్యాల్ని అర్థం చేసుకొని వ్యంజించే మనం, వారి—సంచలించే, బద్దలుచేసే, సర్వాన్నీ ఇముడ్చుకొనే—మానవానుభవాల భావాలను పలికినప్పుడు అవి మన బూర్జువా విమర్శకులకు చిలుక పలుకుల్లా, వార్తా పత్రికా పదజాలంలా తోస్తాయి. అందుకు ఆశ్చర్యపడను. బూర్జువా సమాజమూ, దానిని ప్రతిబింబించే కళా—ప్రతీ ఇతివృత్తంలోనూ కొన్ని ప్రత్యేక ఏర్పాట్లకయి మూర్ఖంగా పట్టుబడతాయి. ఆ ఏర్పాట్లే శ్రామికవర్గ ఉజ్జీవనానికి ప్రతిబంధకాలౌతాయి. పోగా, మధ్యతరగతివారి ఆధ్యాత్మికానుభవాల 'నర్మోక్తులు' కూడా శ్రామికవర్గాన్ని కదలించలేవు.

"శ్రామికవర్గపు కళ విశ్వజనీన మానవాభిరుచుల మీద ఆధారపడుతుందనీ, లోతుగా—జీవితమూ మృత్యువూలాగే—సర్వమానవ ఇతివృత్తాల్ని ఆశ్లేషిస్తుందనీ ఖచ్చితంగా చెప్పుకోవాలి. అది సత్యం. అశేష శ్రామికవర్గపు ఆధ్యాత్మిక

స్వభావప్రవృత్తుల వివరణలో శాశ్వత మానవార్థాలున్నా వాస్తే ప్రతిభగల కళాకారుడు తన రచనలో ఈ సత్యాన్ని చూసుకో గలడు."

ఎర్నెస్ట్ టాలర్ సామాజిక రచయిత. మనవాడుక భాషలో ఇంచు మించు 'అభ్యుదయ' రచయిత అన్నమాట. అన్నంతలో అతని రచనంతా రాజకీయ ప్రచారం అనుకోకూడదు. సోమసుందర్ లాగే టాలర్ కూడా కవి. అతని కవిత్వం, అతని నాటకం తీవ్రసామాజికోద్యమంలో సంభావితాలయ్యాయి. సాంఘిక దురన్యాయాన్ని ఎదుర్కొనే యుద్ధ తీవ్రతలో ఆవేశితమయ్యాయి కూడా. అతని యుద్ధ నినాదం అప్పుడప్పుడు విపరీతంగా కనిపించినా అందులోని ఆగ్రహ విషాదాల ఉచ్ఛ్వాస నిశ్వాసం ఆ రచనకు జీవితం పోసి, అతని రాజకీయాలకు విశ్వజనీన నాటకార్థాల నిస్తుంది. శాంతిలో, యుద్ధంలో మానవత్వం పొందుతున్న దుస్థితికి పెట్టుబడిదారీ విధానమే మూలహేతువని టాలర్ శపిస్తాడు. సృష్టి స్థితులకు మూలమైన 'స్త్రీ' మానవ అంతరాత్మకు రూపాంతరమై, స్వప్నాల ఉన్నతాలకు సంచలిస్తూ, భయసందేహాలమధ్య ఊగుతూ, ప్రబలమైన భావాలతో, దుర్బలమైన చర్యలకు దిగి, యుగీనకష్టనిష్ఠురాల అడవుల ముళ్ళదారుల పడి తిరుగుతూ, నిరాశా అంధకారాలలో హిమాలయోన్నత దర్శన (vision) కై తడుముల్లాడుతుంది.

ఆగ్రహం, ఆవేదన, సంఘర్షణ మొదలైన ఇందలి మానవావేశాల్ని బట్టి చూసినట్టయితే ఇందులో ప్రేమ, ఆశ పెనగొని విలీనమైనట్టు తెలుస్తుంది. కనుక ప్రదర్శనలో ఐక్యత, సున్నితమైన నిగ్రహం, తీవ్రత, అవసరమౌతాయి. ఇక ఇందులోని దృశ్యం, చర్యా విశ్వజనీనాలు కనుక ఈ నాటకంలో ఎక్కడా వాస్తవిక దృశ్యీకరణం అవసరంలేదు.

ఒకసారి చూసినవారికి ఈ నాటకం చాలా కష్టసాధ్యమనీ, ప్రదర్శ నానుకూలం కాదనీ భయపిస్తుంది. కాని, నాటక రంగంలో ఇదొక అమూల్య రత్నమని అనుభవమే రుజువు చేసింది. ఇందులో ఇమిడి ఉన్న నాటకీయశక్తి, నాటకీయ సత్యము దానికి తగ్గ సాక్ష్యమిచ్చాయి. ఇందలి సంచలించే, సంచలింపజేసే అధ్యాత్మికానుభవ తీవ్రతకు ఒక స్వరూపం ఇవ్వగలిగిన శక్తి నవీననాటక పరికరాలకుంది. కవిదర్శనను రూపొందించగల రంగంలోని చేతనాచేతన జగత్తునూ, దీని తొలిప్రదర్శ నలో ఉపయోగింపబడ్డ సాంకేతిక చరిత్రనీ తెలుసుకోవాలంటే దీని దర్శ కుని అనుభవాలు గ్రహిస్తే చాలు. హెర్ జూర్గెన్ ఫెహ్లింగ్ దర్శకత్వం క్రింద ఇది బెర్లిన్‌లో సెప్టెంబర్ 1921 లో ప్రదర్శింపబడి అద్భుత విజయాన్ని సాధించింది.

ఆయనంటాడు :

"ఈ నాటకంలోని దృశ్యమూ ఏక్షనూ కూడా ప్రాపం చికమే కనుక దీనికి స్థానిక వివరాలతో నిమిత్తం లేదు; అందుచేత నా దృష్టిలో, స్వప్నచిత్రాలనబడే రెండు, నాలుగు, ఆరు అంకాలే కాకుండా మొత్తం నాటకం యావత్తూ వాస్తవి కతతో సంబంధం లేకుండా పోవాలి.

"నా ప్రదర్శనలో ఆత్మతేజస్సును సూచించటం కోసం లైమ్‌లైట్ కిరణాల వక్రీభవణం చూపించాను. జ్ఞానేంద్రి యాల ఉద్రేకతకు నాటకరంగం ఒక చక్కని లేబరేటరీ అనే సత్యాన్ని నేను విస్మరించలేదు: పోగా దృశ్యం మనలో కలిగించే ముద్రల్ని మించి 'మాట' తన ప్రభావాన్ని నాటుకో వాలనే సంగతిని కూడా నేను మరిచిపోలేదు.

"కాంతినీ ఆవరణనీ వినియోగించుకొని దృశ్యాలన్ని టినీ ఒక చక్కని మహామయసభలా నిర్మించాను. ఒకే

నల్లరంగు గుడ్డలో ప్లాట్‌ఫారాల్ని, మెట్లు వగైరా అలంక రించాను. ఇవన్నీ విడివిడిగా క్షేత్ర గణిత రీత్యా అమర్చబడి ఉంటాయి. దృశ్యాలు కంటికి స్పష్టంగా గోచరించడానికి ఇది ఉపకరిస్తుంది. దానివల్ల స్వేచ్ఛగా నటించే అవకాశం కూడా కలుగుతుంది. రంగమంతా నల్లని తెర అలముకొని ఉంటుంది. నేల కూడా నల్లరంగుతెరే. పచ్చని దీపాలతోను అక్కడక్కడ ఎర్రని కాంతి జీరలకలసి అంచులేని లోతు కలదనే భ్రమను కల్పిస్తుంది. తద్వారా క్షణక్షణం మారే నాటక సంఘటనల కనుకూలంగా కాంతి కేంద్రీకరణ మారి కదే జరుగుతూంటుందన్నమాట. దృశ్యానికీ దృశ్యానికీ మధ్యకాలాన్ని తెరమరుగు సంగీతంతో నింపి, దానిద్వారా ప్రతీ దృశ్యంలోనూ అవసరమయ్యే మూడ్ని (Mood) పరిచయించి పరిపూర్ణం చేస్తాము. రెండవ చిత్రం బిజారె ఫాక్స్‌ట్రాట్ (Bizarrefox-trot) తో ముగుస్తుంది. నాల్గవ చిత్రంలో భయంకరమైన మందరిస్థాయిలో Concertina ప్రారంభమయి నిషాద స్థాయిలో dance macabre గా అవు తుంది. ఏడవ చిత్రం ముందు ఆర్కెస్ట్రల్ ఇంటర్‌లూడ్ అంతా వాయిలిన్ సోలో లోకి లీనమై సోనియా ప్రార్థన వాక్యాలక్రింద పలుకుతుంది.

నా నాటకంలోని సోనియా పాత్రధారి సహజగంభీర కంఠం పుస్తకంలోని కాఠిన్యాన్ని నొక్కి పలికి అద్భుతంగా రసస్నిగ్ధం చేయగలిగింది."

ముగిస్తూ టాగర్ ఆశిస్తాడు:

"మొత్తం మీద ఈ రచన ప్రపంచ విప్లవకావ్యానికి ప్రస్తావన: ఈ నాటకం ఒక మహోజ్వల కవిత్వ ఉదయం:

సూర్యదర్శనం అయ్యాక దీని కావ్యమూల్యం ఇగిరిపో వచ్చేమోగాని అది పుట్టిన సావేశ మానవలోకంలో మాత్రం కాదు."

ముగిస్తూ నే నంటాను :

"జీవితంలో తుఫాను వాతావరణం ఏర్పడ్డసమయంలో అతి తొందరగా ఉద్రేకాలు మొలకెత్తుతాయి. ఆ ఉద్రేకాలు మంచివారి తొక్కనివాడు పిచ్చిదనానికి పరిణమించి ఫక్కున నవ్వుతాయి. వివేచించనివాడు పశువే; వివేచించలేనివాడు మూర్ఖుడు; వివేచించటానికి ధైర్యం లేనివాడు బానిస. ఈ నాటికలోని అంతరాత్మ [సోనియా] ఈ జీవిత తుఫాను రోజుల్లో మనకు వివేకాన్ని ప్రసాదిస్తుంది."

శామల్‌కోట,
4 జులై 51.

—రాం షా.

# న ట జ నా ళి

కార్మికస్త్రీలు, పురుషులు

స్త్రీ (సోనియా)

ఆమె భర్త (ఒక ఉన్నతాధికారి)

నామరహితుడు

ఒక ఆఫీసరు

మతగురువు

ఇద్దరు స్త్రీ ఖైదీలు

సోనియా స్వప్నచిత్రాలలో

సోనియా

మార్గదర్శి

ఒక ఉన్నతాధికారి

బ్యాంకర్లు

ప్రజల సెంట్రీలు

నామరహితుడు

ఖైదీలు

పీడలు

రెండు, నాలుగు, ఆరు దృశ్యాలు స్వప్నచిత్రాలు

ఒకటి, మూడు, అయిదు, ఏడు దృశ్యాలు వాస్తవవాస్తవికే ఘట్టాలు.

# మందీ-మనిషీ

## చిత్రం ఒకటి

దృశ్యం : సామాన్యంగా కార్మికులు కలుసుకునే చిన్నహోటలు. లోపలి గది. గదికి మధ్య మురికిపట్టి అసహ్యంగా వున్న టేబిలు. ఒక స్త్రీ, కొందరు కార్మికులు చుట్టూ కూర్చుని ఉంటారు.

మొదటి కార్మికుడు :
కరపత్రాల్ని పంచివేశాం.
మనం పెద్ద హాలులో సమావేశ మవుతాం.
రేపు తెల్లారేసరికి ఫ్యాక్టరీలు మూసేస్తాం.
కోపోద్రేకంతో పొంగిపోతోంది జనం
ఇటో అటో తేలిపోతుంది రేపుదయం.
(ఆమెతో) ఐతే నువ్వు సిద్ధంగా వున్నావా కామ్రేడ్ ?

స్త్రీ :
నేను సిద్ధంగానే ఉన్నాను.
ప్రతి ఉచ్ఛ్వాసం మహాశక్తిని రగులుస్తోంది నాలో
ఈ తరుణం కోసం ఎంత నిశ్చలమైన కాంక్షతో
నిరీక్షించాను నాజీవితంలో !
ఉడికే నాగుండె నెత్తురే మాటలుగా
మారుతోంది. ఈ మాటలే సజీవకార్యా
లవుతున్నాయి. బ్రతుకు బాట ఒడి దుడుకుల్లో
తగిలిన వెన్నిగాయాలు ! సిగ్గుతో, బాధతో
నిస్సహాయపు రోషంతో బిగించిన పిడికిలితో
బొబ్బరించిన దెన్నిసార్లు !
అధమ పత్రికలు సైతం

ఆ మహావిజయాన్ని కీర్తించే ఆరోజున
నాకు తెలుసు;—లక్షహస్తాలు నన్ను
బంధిస్తాయి. నిందిస్తాయి ఒక కోటి
కంఠాలు నన్ను: 'మా మరణాలకు కారణం
నువ్వే—' అని నన్ను నిరశిస్తాయి.
అవునవును, ప్రతి తురంగమూ
పార్శ్వాలు కంపిస్తూ, చెమట నురగలు
క్రక్కుతూ, మూగగొంతులతో
నిజము—నిందిస్తుంది నన్నే!
న్యాయసంరక్షణకోసం, ఈ నూత్న
ధర్మాన్ని ప్రతిపాదించే సమయంలో
నేను కాసాళిని పూరిస్తున్న క్షణంలో
నా హృదయంలోని మహాకాంతి
తరంగాలై ప్రవహిస్తూండగా
సమ్మెను ప్రకటిస్తాను నేను.
నేనే అన్న మాటేమిటి?—
నరజాతి సర్వం సమ్మెకు పిలుపిస్తుంది.
సమ్మెను ప్రోత్సహిస్తుంది రమణీయప్రకృతి సహితం!
నా కాలు నాకుతూ నన్నభినందించే
నాయింటి ముంగిలిలోని కుక్క సైతం
'సమ్మె—సమ్మె!' అంటూ మొరుగుతుంది.
హసన్సంటూ పారే నదులుకూడా నేడు
సమ్మెకే వుసి కొల్పుతున్నాయి చూడు!
ఈ నాటికి నాజ్ఞానం ఎంత ప్రబలమైనదో?
ఈ వేళ పునర్జన్మ పొందుతోంది మందిజనం.

తిని బలిసిన కొవ్వెక్కిన ఘనులు గతకాలంలో
బూటకపు మాటలతో అల్లిన వలల
చిక్కుల్ని ఒక్కుమ్మడిగా విదళించుకుని
నవమానవులు ప్రవహిస్తున్నారదుగో!
వడిగా వెలువడుతున్నారు నరజాతి సైనికులు:
ముమ్మందు కురుకుతున్నారు జనశక్తి సైనికులు!
మానవత్వపు తెరువుల్ని చూపిస్తూ
విశ్వరూపంతో వ్యాపిస్తున్నారు.
భీషణోద్యమ నేతలై—నూతనోత్సాహంతో
అగోచరమైన శాంతి దుర్గాల్ని అంతటా
నిల్పుతున్నారు; నిర్మిస్తున్నారు?
ఐతే ధరించే వారెవరీ జండా?
అరుణ కిరణాల వెదజల్లు జండా—
నవయుగోదయకాంతి జండా!

రెండో కార్మికుడు: నువ్వే—అంతా నిన్ననుసరిస్తారు!

[నిశ్శబ్దం]

స్త్రీ: మనవాళ్లంతా గుట్టుగా ఉంటే చాలు!
పోలీసుల కేమీ తెలియదంటావా?
హాలుపై శత్రుబలాలు ముట్టడిస్తే మాత్రం
జరిగే దేముందిలే పెద్ద—?

మొదటి కార్మికుడు: సరే, పోలీసులకు తెలిస్తే నష్టమేముంది?
మన అంతిమలక్ష్యం తెలియదుకదా వాళ్లకి:
హాలంతా ఒక్కసారి జనం నిండితే సరి—
పాతాళగంగయితే స్వాధీన మవుతుంది.

కాని యిది మానవప్రవాహం!
జలపాతంలా పురికి వరదలై పొంగుతుంది
పోలీసుల శక్తి కతీతమై ఉజ్వలిస్తుంది.
అయినా, పోలీసులుకూడా మేలుకుంటున్నారు,
అధికార మధిరాన్ని త్రాగి ఎంతకాలం బ్రతుకుతారు?
ఆందోళనలో ఊగిసలాడు తున్నారు.
సైన్యాల మనుగడకూడా మనతో చేనేడు.
పనిచేస్తూనే వున్నాయి ప్రతిచోటా
సిపాయిల సంఘాలూ, కార్యనిర్వాహకవర్గాలు.
సర్వనిశ్చయం జరిగే మహాదినం రేపే!
అంతా స్థిరపడుతుంది రేపే! క్రామేడ్!

[తలుపుగుద్దిన చప్పుడు]

మొ॥కార్మికుడు ద్రోహం! ద్రోహం!

రెం॥కార్మికుడు ఏమైనా వాళ్లు నిన్ను పట్టుకు పోకూడదు.

మొ॥కార్మికుడు ఎలాగ? ఒక్కటే గుమ్మం!

రెం॥కార్మికుడు కిటికీనుంచి దూరి పో!

మొ॥కార్మికుడు సన్నని వెలుగుతెర కమ్ముతోంది కిటికీ.

రెం॥కార్మికుడు అయితే సమర మాసన్నమైనట్టే—

[గట్టిగా తలుపు గుద్దిన చప్పుడు. తలుపు తెరుచుకుంటుంది. ఆమె భర్త ప్రవేశిస్తాడు. కోటు కాలరు పైకెత్తి ముఖానికి చాటుగా వుంటుంది. కంగారుగా చుట్టూ కలయచూసి టోపీ పైకెత్తుతాడు.]

స్త్రీ : (కార్మికులతో) మన కితడు మిత్రుడే;—లేదు
భయపడాల్సిన అవసరం సుతరామూ
కలుసుకుందుకు వచ్చారా నన్ను ?
రండి—మాట్లాడు కుందాం.

భర్త : ..... ..... ..... ..... ..... ..... .....
(మెల్లగా) నన్ను వారికి పరిచయం చేయకుమీ
ఐతే—నే నిపుడు నీతో మాట్లాడవచ్చునా ?

స్త్రీ : కామ్రేడ్స్ !

కార్మికులు : రేపు కలుసుకుందాం మరి—

స్త్రీ : నమస్కారం.

(కార్మికులు వెళ్లిపోతారు.)

భర్త : సరే—ఇక్కడి కిప్పుడు రావడం నేనేమీ
సహాయం చేయడానికి కాదని
గ్రహించే వనుకుంటా నీ పాటికి.

స్త్రీ : నాలో మొగ్గ తొడుగుతున్న
క్షణ ప్రభలవంటి స్వప్నాల్ని మన్నించండి !

భర్త : నీ నడవడిక మాత్రం
నన్నవమానం పాలుజేస్తోంది.
అదే ప్రోద్బలమిచ్చిందికూడా నారాకకి.

స్త్రీ : ఒక పౌరుని మర్యాదకు నా
చర్యలు భంగం కలిగిస్తున్నాయా ?
ఆశ్చర్యం !—ఓట్లు లెక్కించడం కూడా
పూర్తి అయింది కాబోల్నే !

అధిక సంఖ్యాకులు మిమ్మల్ని
అధికార వర్గంనుంచికూడా తొలగిస్తా మని
భయపెడుతున్నారేమో—పాపం!

భర్త: నా కోరిక మన్నించి
నన్ను పరిహాసం చెయ్యకు!
నువ్వు తిరస్కరించే నిర్ణయాలకే
మనసావాచా విధేయుణ్ణి నేను.
శిష్టజనుల కట్టుబాట్లకీ—
పద్ధతికీ, ఫాయికీ, బద్ధుణ్ణి నేను.

స్త్రీ: అవును; మీరూ మీవంటి మహనీయులే కదా మరి
ధర్మాన్ని నాలుగు పాదాలా నడిపిస్తున్నది నేటికి!

భర్త: సత్యపరాయణతకీ, ఆత్మ
సంయమానికీ మా జీవితాలు
అంకితమైనా యెప్పుడో....
ఎందుకులే, అర్థం చేసుకోలేవు నా మాటలు....

స్త్రీ: నిజం—మీ కన్నుల్ని నేను చూస్తూంటే....

భర్త: అబ్బా! కంగారు పెట్టకు నన్ను....

స్త్రీ: మీరు.........మీ — రే — నా —

భర్త: క్లుప్తంగా చెబుతున్నా విను
నీ చర్యల నరికడతాను.

స్త్రీ: మీ రా—

భర్త: సమాజానికి సహకరించాలనే
నీలోపలి ప్రబలమైన ప్రేరేపణకి

మన వర్గాలలోనే మార్గాంతరం లేదా ?
ఒక్క నిదర్శనం చెబుతా విను:
తల్లి తండ్రీ ఎవరో తెలీని, దిక్కులేని పిల్లలకి
స్థాపించవచ్చును కదా అనాథశరణాలయాలు !
నీవు నిరశిస్తావు కానీ—ఇది
సాధువర్తనకీ, భూతదయకీ, ఔదార్యబుద్ధికీ
ఎంత మహత్తరసాక్ష్యం చెప్పు ?
నీవు గౌరవించే కార్మిక కామ్రేడ్సు సైతం
అవివాహితలగు తల్లుల్ని తృణీకరిస్తారుకదా !

స్త్రీ : దానికేం — సరే, చెప్పండి !

భర్త : ఇదిగో చెబుతున్నా విను :
నీ యిష్టం వచ్చినట్టూ చేయడానికి
స్వాతంత్ర్యం లేదు, తెలిసిందా నీకు !

స్త్రీ : ఏం—సంపూర్ణమైన స్వాతంత్ర్యముంది నాకు !

భర్త : నీకు పూర్తిగా అంగీకారం
కుదరనప్పటికీ, కొంచం
సమయోచితజ్ఞానం
ఉండాలికదా, దేనికయినా !
కనకనే ఈ విషయంలో పునరాలోచన
అత్యవసర మంటున్నాను.

స్త్రీ : నేను దేన్నీ లక్ష్యపెట్టను ;
మేము చేయాల్సిన కర్తవ్యమొక్కటే తప్ప !
ఈ మహత్తర కార్యమే ఆచరిస్తాను.

సరిగా అర్థం చేసుకోండి నన్ను—
ఈ వ్రతానికే నా బ్రతుకు అంకితం.

భర్త : నీ అభిప్రాయాల్ని కొంచం
విడతీసి విశదపరచనియ్యి !
విస్తృతమైన ఉద్యమాలపై గల నీ కోరికే
నీ ప్రవర్తనలను పరిపాలిస్తోంది ఊరికే !
ఏవో నిశ్చితాభిప్రాయాల చుట్టూ
అల్లుకున్న ఈ కోరిక లేవైనప్పటికీ
మహత్తరమైనవి కానేరవని
నే నెంతమాత్రం చెప్పడం లేదు.

స్త్రీ : మీ పెదవుల జారిన ప్రతిమాటా
నన్ను పొడిచి బాధిస్తోంది బాకై.
మనరైతుల ఇళ్లల్లో వ్రేలాడే
మెడోనాకన్యల చిత్రా లెప్పుడేనా
చూశారా ?—బాకు చీల్చిన గుండెలతో
చిమ్ముతున్న నల్లని నెత్తుటి తూటులతో
కారుతున్న కన్నీటి వెల్లువతో—
ఆ సుకుమారమైన పవిత్రచిత్రాల వికారం !
అవెంత వివేక శూన్యాలో
అంత మహత్తర మైనవట !
మీరు — మీరో.
నా మహదాశయాల గురించి మాట్లాడ గలరా ?
మీకూ నాకూ మధ్యలో అఖాతం
తెరుచుకుంటోంది భయంకరంగా !

నావిధిని మార్చినది - సోమరికోరిక ఏదీకాదు.
జీవితావస్యకత ఒకటే నన్ను మార్చింది.
నాగుండె లోతుల్లో నిలచిన కాంక్షలు —
కేవలం మానవజీవిని కావాలనే ఆకాంక్షలు,
నన్ను స్పష్టంగా అర్థం చేసుకోండి—
నన్నింత మార్చేసింది అవసరమొక్కటే,
తీరుబడి సమయాలు గడపడం కోసం
కాదీ జీవితోద్యమం, దీనికి పునాది—
రసావేశమో—ఉద్రిక్తభావమో అసలేకాదు.
మానవత్వపుకాంక్ష—అదొక్కటే నామీద
ఎనలేని ప్రభావం కలిగిస్తోంది!

భర్త: అవసరమా? అవసరం గురించి ప్రస్తావించే
అర్హత కూడా ఉందా నీకు?

స్త్రీ: నాజీవితాన్ని మార్చాలని
మీరింక వృధాగా శ్రమపడకండి!
అనవసరంగా విపరీతాలు మాట్లాడకండి!
ఓ నా ప్రియా—ఒక బిగి కౌగిలి....
మీకన్నులపై ఒక్క ముద్దు—నా ఆఖరికోరిక తీర్చండి!

భర్త: హృదయపూర్వకంగా నిజం చెబుతున్నాను:
నిన్నేమీ బాధించదలుచుకోలేదు.
మనసంభాషణ ఇతరులకి వినపించకపోతే
ఒక సంగతి....

స్త్రీ: ఒకవేళ ఎవరో ఒక కామ్రేడ్ విన్నప్పటికీ

అది వాళ్ల కనవసరం. మర్యాదస్తుల
నీతి నియమాల గురించి వాళ్లసలు ఆలోచించరు.
మీరు వాళ్ల నర్థం చేసుకోవడం లేదు,
వారి అవసరాల్ని గుర్తించడం మన విధి.
అదే మన అవసరం, తప్పనిసరిగా!
వారిని తృణీకరించారు మీరు; వాళ్ల
అవమానమే మిమ్మగౌరవ పరుస్తోంది.
కాబట్టి మీ దురదృష్టవిధిని మీరే
లిఖించుకుంటున్నారు.
మీకన్నులు కురిసే కరుణను మీరే
ధరించుకొండి హృదయంలో!
వ్యక్తావ్యక్తాల నడుమ జీవించే, ఆలోచనా
శూన్యనుకాను; మధురభావాలలో సంచరించే
దాన్నికాను; మృదుతరానుభూతులో,
క్రూరికలుషాత్మ మడియలోకాని మమ్మల్ని
ఈ మహత్కార్యాల కొజ్ఞాపిస్తూంటాయి.
అంచేతనే నేను వాళ్లకే చెందుతాను.
అట్టి అసమాన అనుభవాలే మా భేషజాలనూ
బలహీనతలనుగూడ లాలించి పాలించుతాయి!
అయితే, నేనిప్పుడెలాగ నవ్వేతున్నానో
అలాగే బిగ్గరగా వికావిక నవ్వకపోతే—
ఇక్కడున్న కామ్రేడ్సంతా నిన్నుచూసి
అసహ్యాంతో ఛీత్కరించుతున్నారన్నమాట!

భర్త : అయితే, సత్యం ఇప్పటికేనా గ్రహించవా?

నీ కార్యక్రమాలన్నీ రహస్యపరిశోధనాశాఖకు తెలిశాయి;
అధికారులు నిన్ను వెన్నంటుతూనే ఉన్నారు.
నేను ప్రభుత్వానికి విధేయత ప్రకటించుకొని
ప్రమాణం స్వీకరించాను—కాని నీవో నా
ప్రతిన తెలుపు భగ్నపరుస్తున్నావు.



స్త్రీ : అయితే—?

భర్త : దాపరికం లేకుండా స్పష్టం చేస్తున్నావిను :
నీ చర్యల మూలంగా బాధలనుభవించాలి నేను;
అది నా హృదయంలో కలవరం కలిగిస్తోంది.
ప్రభుత్వానికెంత ప్రమాదం కలిగించాలనుకుంటావో
నా జీవితాన్ని సైతం అంత ప్రమాదంలోనూ
ఇరికిస్తావు. కారణం—మన మధ్యలోనే
ఉంటున్న శత్రుపక్షాన్ని చేరి బలపరుస్తున్నావు.
అదొక్కటే చాలు మన దాంపత్యపు విడాకులకు కారణం.

స్త్రీ : అలాగయినట్టయితే—నేను నీకే హాని కలిగించే పక్షంలో—
నీ మార్గానికి నేనే అడ్డంకిగా ఉన్న పక్షంలో—

భర్త : అప్పుడే సమయం మించిపోలేదు, కాని—

స్త్రీ : ఆ పక్షంలో నేనే సిద్ధంగా ఉన్నాను.
నా కార్యాల కొనగూడు నేరాల్ని
నేనే అనుభవిస్తాను. మనవిడాకులు
మీకు హానికలిగిస్తుందని భయపడాల్సిన
అవసరమేమీ లేదు. నిన్ను....నిన్ను
నా బాహులత అల్లుకొంటుంది—

నాలో పొంగుతున్న మహావాంఛతో!
నీకోసం నా నరాలలో రక్తం కుసుమిస్తోంది.
నీవు లేకపోతే నేనొక వాడిన పత్రాన్ని.
విరిసిన నాహృదయానికి తేనెసోనవు నీవే!
దాహంతో తప్తమైన నానరాల దారులలో
నిప్పుల నెగజిమ్మే గ్రీష్మప్రభంజన మీవే!
ముకుళించిన పసిపిల్లల కేకలెవో,
చీకటి గొంతులెత్తి అరచిన రాత్రులెవో,
జీవనవాహినిలో యవ్వన తరంగాన
ఉవ్వెత్తుగలేచి, నిటారుగా నిలచి రెక్కల
విప్పుతు, రెపరెప విదళిస్తూ ఎగురుతాయి.
ఓహో! పూవులతో తలల నెత్తి
నవ్వుతున్న పొలాలలో, ఆరామ
స్థలాల వాహ్యాళికొ, నిశ్శబ్దం
పాడుకునే లోయలకో—ఎటకో
నను వేగంగా తోడ్కొనిపొమ్మా!
మృదుమధురముగా నీకన్నుల ముద్దిడనిమ్మా!
నీజీవితమాలంబన రహితంగా
నేనొక దుర్బలనే అనుకుంటా—
అవును నేను సాటిలేని అబలను.
బలహీనత కిదికూడా నిదర్శనం
అనుకుంటే, అబ్బా—క్షమించాలి!
నీ విషయం విడిగా పరిశీలిస్తే—
నీ వన్నదికూడా న్యాయమనే తోస్తుంది. కాని
రేపే నేను ప్రజలముందు నిలుస్తాను.

రేపే ఈ ప్రభుత్వాన్ని తీవ్రంగా ఎదిరిస్తాను.
రేపే నిరశిస్తూ ఉపన్యసిస్తా దానిని.
నీవా ప్రభుత్వయంత్రం సన్నిధిలో
విధేయతా బద్ధాంజలితో ప్రమాణం
స్వీకరించావు, పాపం! ఘోరమైన హత్యలపై
మేలిముసుగువేస్తూ దాచిన ఈ నాగరికత
తెరలను రేపే పరపరమని చింపేస్తాను.

భర్త: కానీ కుతంత్రాల కుట్రసుమీ
ఇది రాజద్రోహ మహాపరాధం!

స్త్రీ: మీ ప్రభుత్వమా
మారణయుద్ధం చేస్తోంది.
మానవద్రోహం చేస్తోంది.
నీ ప్రభుత్వమే నిత్యం దోపిడీలు సాగిస్తోంది.
జనాల పీకనులిమి చంపేస్తోంది.
పసిబిడ్డల గుండెలు కాళ్లరాసి నలిపేస్తోంది.
వంశనాశనం కావిస్తోంది!

భర్త: పవిత్రమైనది ప్రభుత్వం—
దాని ప్రాణాన్ని రక్షిస్తుంది యుద్ధం.
ఉన్మత్తుల అవ్యక్తమైన భ్రాంతిమాత్రమే శాంతి!
భగ్నమైన సాయుధసంధే యుద్ధం!!
యుద్ధమే పరిపాలన; ప్రభుత్వాల
కది అనన్యమైన సజీవలక్షణం.
రాజ్యాంగానికి శత్రుపులెప్పుడూ
ఇంటాబైటా భీభత్సం కల్పిస్తూనే ఉంటారు.

స్త్రీ : అంటువ్యాధులూ, అగ్నిహోత్రాలు
తినివేస్తున్న శరీరం ఎలా జీవిస్తుంది చెప్పు!
ఈరాజ్యాంగపు నగ్నశరీరాన్ని పాపం
నీ వెప్పుడూ చూడలేదు;—రుల రులమని
పురుగులు తినేస్తున్నాయిదాన్ని, మానవజీవితాలమీద
ధనస్వాముల వ్యక్తిగత పెట్టుబడి అధికారం చేస్తోంది.
నీవు దాన్ని చూడలేకపోతున్నావు—నాకు తెలుసు,
దానిపై నీకు ప్రమాణపూర్తిగా విధేయత వుంది;
నీడ్యూటీ నువ్వు నిర్వర్తిస్తూంటావు; అంతేకాని
పాపం నీ అంతరాత్మ ఆరుబైట హాయిగా
నిద్రపోతూండడం సుతరామూ కనిపెట్టలేవు.
నీ హృదయం శూన్యాకాశంలో విశ్రాంతి
తీసుకుంటున్న వాస్తవం నీవెన్నటికీ గ్రహించలేవు

భర్త : ఐతే నీ తుదినిర్ణయం ఇంతేనా ?

స్త్రీ : ఔను, ఇదే నా ఆఖరి నిర్ణయం!

భర్త : అయితే నాకిక సెలవిస్తావా ?

స్త్రీ : నమస్కారం.

[భర్త బైటికి వెళ్లిపోతూ ఉండగా]

నీతో నేనూ రావచ్చునా ?
ఈ వేళ....ఆఖరి సారిగా....
ఛీ సిగ్గువిడిచి అర్థిస్తున్నానేమిటి ?
లేక నన్ను సిగ్గే విడిచిపెట్టిందా ?
నాతుదినెత్తుటి బొట్టుకూడా
సిగ్గు విడిచిపెట్టేసిందా ?

[స్త్రీ భర్త ననుసరిస్తుంది. రంగస్థలంలో చీకటి]

# చిత్రం రెండు

## [స్వాప్నికజగత్తు]

[స్టాక్ ఎక్స్ఛేంజి లోపలిభాగం. డెస్కు కెదురుగా అఫీషియల్ రికార్డరు కూర్చున్నాడు. అతని చుట్టూ బ్యాంకర్లూ, బ్రోకర్లూ. ఆ రికార్డరుది గతచిత్రంలోని 'భర్త' ముఖం.]

రికార్డరు : రికార్డు చేశాను.

బ్యాంకరు 1 : ఆయుధాల ఫ్యాక్టరీలు 350—

బ్యాంకరు 2 : ఆ సంఖ్యను 400 గా మదించు.

బ్యాంకరు 3 : అప్పడు నేను—400 కే అమ్మతాను.

బ్యాంకరు 4—బ్యాంకరు 3 ను ముందుకు లాగుతాడు. నేపథ్యంలో అమ్మకందార్లూ కొనుగోలుదార్లూ గొడగొడ.

బ్యాంకరు 4 : (బ్యాంకరు 3 తో) విన్నావా వార్తలు?
మన బలగాలు తిరోగమించాయట.
ఉద్ధృతమైన ఎదురుదాడి
అపజయం పాలవుతోందట.

బ్యాంకరు 3 : రిజర్వు మాటేమయిందో,

బ్యాంకరు 4 : ఆ సరుకంతా చచ్చురకానిది.

బ్యాంకరు 3 : ఆహారపదార్థాలుకూడా సరైనవికావా?

బ్యాంకరు 4 : అదికూడా అలాంటిదే—
ఒకవేళ ఆచార్య హుడేగారు
రై ధాన్యంలో నూటికి 95 పాళ్లు
రాజభోజనాలని ఆలోచించి
నప్పటికీ అంతే!

బ్యాంకరు 3 : అయితే నాయకత్వం మాట?

బ్యాంకరు 4 : అబ్బో మహాద్భుతం.

బ్యాంకరు 3 : సారాయిలు సరిపోవేమో?

బ్యాంకరు 4 : డిస్టిలరీ యంత్రాలు
మహాపీడనశక్తితో పనిచేస్తున్నాయి.

బ్యాంకరు 3 : అయితే ఏమిటి లోటు?

బ్యాంకరు 4 : హెడ్‌క్వార్టర్సునుండి జనరల్‌గారు
తొంభై ముగ్గురు ఆచార్యులకోసం
ఆఫీసు సిబ్బందిలో ఉన్న 'గ్లూబరు' తో సహా
రమ్మని కబురంపించారట.
వాడు మనచేతుల్లో మనిషే అనుకో—
ఏమైనా ఫలితాల గురించి పుకారుగానే ఉంది.

బ్యాంకరు 3 : ఏమిటా పుకార్లు?

బ్యాంకరు 4 : ఈ విషయాలు బూర్జువా బృందాల
చీకట్లో రహస్యంగా ఉంచబడ్డాయి.

బ్యాంకరు 3 : విచ్ఛిన్నప్రేమప్రలాపాలు
సైన్యాల బలహీన కలాపాలా?

బ్యాంకరు 4 : ఏం చిత్రమోగాని అలాంటిదేమీ జరగలేదు.

కారణం—మనిషిని మనిషి ద్వేషించటం.
ఉన్న పెద్దలోటంతా అదే!

బ్యాంకరు 3 : ఏమిటా పెద్దలోటు?

బ్యాంకరు 4 : జీవితపు సారాంశమంతా
తేటతెల్లం కావటం!

బ్యాంకరు 3 : అయితే, ఏమిటా గొప్పలోటు?

బ్యాంకరు 4 : మందజనాలు మత్తెక్కించే
అభిప్రాయాల్ని కాంక్షించడం.

బ్యాంకరు 3 : అయితే మాత్రం,
వచ్చిన లోటేముంది?

బ్యాంకరు 4 : ఆదర్శప్రేమ!

బ్యాంకరు 3 : అయితే సరిపోయిందింక!
అప్పనుగాని ఈ యుద్ధం—
మనకిగల ఒకే ఆయుధం.
మనకిగల మహాశక్తివంతమైన యంత్రం.
మనజీవితతంత్రుల్ని బిగించి లాగుతోంది.
రాజుల్నీ, రాజ్యాంగాల్నీ, మంత్రుల్నీ
శాసనసభల్నీ—ముద్రాలయాల్నీ
దేవాలయాల్నీ—అన్నిట్నీ తనచుట్టూ
నర్తింపచేస్తోంది. అవన్నీ విశ్వగోళానికి
సుంద్రంగా, సప్తసముద్రాల చుట్టూరా
నాట్యం చేస్తున్నాయి!
అపజయం పొందింది యుద్ధం—

ఆపజయం మనదేనంటావు నువ్వు!
అదేనా మనకున్న నిల్వ?

బ్యాంకరు 4 : లేదు, నువ్వు తప్పుడులెక్కలు కట్టావు.
పొరబాటెక్కడుందో తెలిసి పోయింది,
మనచిత్రాలు తప్పక నిల్వాలు చూపాలికదా?

బ్యాంకరు 3 : అదెలాగ సాధ్యం?

బ్యాంకరు 4 : ఏముంది—అంతర్జాతీయ దృక్పథంతో చూస్తే సరి!

బ్యాంకరు 3 : ఆ విషయం అందరికీ తెలుసునా?

బ్యాంకరు 4 : దానికి వ్యతిరేకం తెలుసు.
దాని కా విధమైన దుస్తులువేస్తున్నాం మనం—
అది పూర్తిగా ఖచ్చితమైన దేశభక్తి
అదే స్వాతంత్ర్యం కూడాను!
అదే మారకంకాని అమూల్యమైన మన నాణెం.

బ్యాంకరు 3 : చిత్రాలో స్పష్టంగా వ్రాయబడ్డదా?

బ్యాంకరు 4 : పెద్దపెద్ద బ్యాంకులన్నీ
మనవాణిజ్యసంస్థల్ని బలపరుస్తాయి.

బ్యాంకరు 3 : లాభాల విషయం?
డివిడెండ్ల సంగతో??

బ్యాంకరు 4 : గిరగిరా తిరిగి అవే—
మనల్ని చేరుకుంటాయి నిబ్బరంగా.

బ్యాంకరు 3 : అది మంచి సంగతే అనుకుంటా
ఉత్పత్తయ్యే సరుకేమి టయితే?

ప్యాంకరు 4 : ఆరోగ్యమందిరాలనీ,
అనాధశరణాలయాలనీ,
పిలుస్తాం వాటిని మనం.
సైనికుల మనోదారుఢ్యాన్ని
పోషించడం ద్వారా విజయాన్ని
సాధించడం కోసం మనం
ఉపయోగించుకుంటాం వాట్ని.
కాని, నిజానికవి ప్రభుత్వమే
నడుపుతున్న వ్యభిచార గృహాలు!

ప్యాంకరు 3 : అద్భుతం! నావాటా నూరువేలు వేయండి.
అయితే ఒక్క ప్రశ్న:
ఎవరు నిర్వహిస్తున్నారు వాటిని?

ప్యాంకరు 4 : అనుభవం కలిగిన జనరల్సూ,
జ్ఞానవంతులైన న్యాయమూర్తులూ,
బాగా పరిశీలించి, నిగ్గుతేల్చి,
ప్రణాళికాబద్ధమైన కార్యక్రమంతో
నడుపుతారు వాటిని.

ప్యాంకరు 3 : బాగా ఆలోచించి పెట్టినదే
అన్నమాట ఈ పద్ధతి!

ప్యాంకరు 4 : ప్రణాళికా బద్ధమైనదని చెబుతున్నాగా!
మూడు రకాలున్నాయి తరతమ బేధాల్లో.
వాటికి అలాగే ఖరీదులున్నాయి—
ఆఫీసర్లుపయోగించుకునే వ్యభిచారగృహాలు,
రాత్రి తెల్లవార్లూ ఉండొచ్చు. రెండో తరగతివి

చిన్న ఉద్యోగులకోసం, ఒక్క గంట మాత్రమే—
దేహబాధ వదిలేందుకు. ఇంక సిబ్బందిలోని
సాదాజనాభా పదినిమిషాల ఇబ్బందులు.
తీర్చుకునేందుకు....

బ్యాంకరు 3 : దండమయా పరమేశ్వర
దండమయా దేవదేవ....
ఐతే ఎప్పుడు తెరుస్తారీ మార్కెట్టు ?

బ్యాంకరు 4 : ఎప్పుడు పడితే అప్పుడే !

[ రంగస్థలం వెనుకభాగంలో కలకలం. బ్యాంకర్లు—3, 4 వెనక్కి నిష్క్రమిస్తారు.]

రికార్డరు : కొత్తగా ప్రారంభించబడింది—
'జాతీయ వ్యభిచార గృహం'
అనే లిమిటెడ్ కంపెనీ ఒకటి.

బ్యాంకరు 1 : కొందా మనుకుంటే నాకేమీ
మిగిలేట్టు కనిపించడం లేదు.

బ్యాంకరు 2 : ఆ డివిడెండ్లేమీ నాకాశ కొల్పడంలేదు.

బ్యాంకరు 3 : మాట జామీనుమీద ఒక్కసారి ఇస్తే
నేనో నూరు వేలు తీసుకుంటాను.

రికార్డరు : ఆఁ— నేను పద్దు వేస్తున్నాను.

బ్యాంకరు 4 : నేను కూడా అదే సంఖ్య !

బ్యాంకరు 1 : (బ్యాంకరు 2 తో) వాడు సిగ్గుమాలిన సేట్ లెద్దూ !
చెప్పు, ఏమంటావు నువ్వు ?

డ్యాంకరు 2 : అదిగో ఎదో టెలిగ్రాం!
పశ్చిమ యుద్ధరంగంలో
అపజయం పొందారు మనవాళ్లు.

డ్యాంకరు 1 : మహాశయులారా!
పశ్చిమరంగంలోని యుద్ధంలో
మనవాళ్లు పొందారు అపజయం!

[పిలుపులు, కేకలు, పెడబొబ్బలూ]

కంఠాలు : ఓడిపోయిందా! శ్రీరామచంద్రా!
ఓడిపోయిందా!!

ఒక కంఠం : ఆయుధాల ఫ్యాక్టరీలు
నూటపేభయి కిచ్చేస్తాం!

మరోకంఠం : 'లిక్విడ్-ఫైర్-త్రోయర్-ట్రస్టు'
అమ్మకానికి రెడీప్లీజ్!

మరోకంఠం : విషవాయువు పరిశ్రమ
అమ్మకానికి సిద్ధంగా ఉందండోయ్!

ఇంకోకంఠం : యుద్ధఋణ పత్రాలు
అమ్మకానికి రెడీప్లీజ్!

డ్యాంకరు 3 : అయితే నేనింకో నూరువేలు
తీసుకుంటున్నాను.

ఒక కంఠం : ఓహో! మందగించి మనవ్యాపారం
తొంగుడున్న సమయంలోనా?

మరోకంఠం : యుద్ధంలో అపజయం కలిగిందని
చెప్పినవాళ్లెవరబ్బా మనకి ?

ఇంకో కంఠం : అసలా వార్తలు నిజమేనా ?
లేక, మార్కెట్‌ను పడగొట్టాలని
చేసిన ప్రయత్నమా ?
అతను చల్లచల్లగా రెండుసార్లు
నూరువేలచొప్పున తీసుకున్నాడేం మరి !

బ్యాంకరు 2 : అదో గుడ్డి గుర్రపు తాపులే—
నేను చూడు, నూటేభయికే కొనేస్తాను.

ఒక కంఠం : నేను రెండువందలని అంటున్నాను.

మరోకంఠం : నేను మూడువందలకి కొనేస్తాను.

ఇంకోకంఠం: 400 కి అమ్మేవాళ్లెవరేనా వుంటే
నేను పాడ్డానికి సిద్ధంగా కూచున్నాను.

రికార్డరు : నేను వ్రాసుకుంటున్నాను.

బ్యాంకరు 4 : (బ్యాంకరు 3 తో) జిత్తులమారినక్క కనిపెట్టింది.

బ్యాంకరు 3 : క్షమిస్తే ఒక్క సంగతి
మహాశక్తివంతమైన ఆయుధం-
రక్షించబడిం దేవిధం ?

బ్యాంకరు 4 : నీ కెందుకయ్యా అనుమానం !
జీవితసూత్రం బహుసామాన్యం.
ఒకానొక పొర్లుదారి ఉండేది పూర్వం
ఇప్పుడు దాని ఆచోకీ కనిపెట్టాం
ఆ దారిని కట్టేశాం సంపూర్ణం.
మన సరుకునిల్వల పాటుపోట్ల భయం

పట్టించుకోనక్కర్లేదు ఏమాత్రం :
ముఖ్యవిషయం—యాంత్రికసూత్రాల సుస్థిరత్వం —
దానిమీదనే మన వ్యాపారరహస్యం ఆధారం.
అందువల్లనే నిలచింది ఈ విధానం :

రికార్డరు : నేను చితాలో వ్రాస్తున్నాను.

[మార్గదర్శి ప్రవేశిస్తాడు. ఏదో ఒక ప్రకాశం వల్ల అతని ముఖం త్రి[illegible] [illegible] వుంటుంది. దానిపై [illegible] [illegible] రేఖలూ, బలమైన జీవనరేఖలూ కూడా అల్లిబిల్లిగా—పడుగు పేకలవలె నే[illegible] బడి ఉంటాయి. అతను [illegible] [illegible] [illegible]యాకూడా ఉంటుంది.]

మార్గదర్శి : మహాశయులారా !
మహావేగంగా మీరు
నింపుతున్నారు చితాలు—
మీ విధానం మనిషి నరాలలోని
రక్తప్రవాహాన్ని పరిపాలిస్తోంది :
మీ విధానం మూగ మానవజీవాలపై
శక్తివంతంగా పనిచేస్తోంది.
కాని మీ విధానంలోనే పెద్ద పగులుంది;
అదే సహజమైన మానవప్రకృతి.
దానిమీద పాదంతో బలంగా ఒక్క
తాపు తన్నేరా—ఆ యాంత్రిక పరికరమంతా
ఆటబొమ్మవలె ఛిన్నాభిన్న మవుతుంది.
కాబట్టి జాగ్రత్త వహించండి !
(ఆమెతో) మాట్లాడవేం నువ్వు ?

సోనియా : (మృదువుగా) మహాశయులారా!
వీళ్లంతా కేవలం స్త్రీ - పురుషులు.
మళ్లీ చెబుతున్నాను—పురుషులూ - స్త్రీలూ!

[చీకట్లో లీనమయ్యే నీడల్లాగ మార్గదర్శి, స్త్రీ కూడా మాయమవుతారు. హఠాత్తుగా నిశ్శబ్దం.]

బ్యాంకరు 3 : నీకు వినిపించిందా!
ప్రమాదభరితమైన గని గుహలుకూలిన చప్పుడు;
లేమి గల జనుల కలవరపు రొప్పుడు,

బ్యాంకరు 4 : ఐతే నేనొక ఉపాయం చెబుతా వినండి:
ఉదారంగా ఒక ధర్మకార్యానికి పూనుకుందాం.
ఈ ఎక్స్ఛేంజి డెస్కు చుట్టూరా ప్రదక్షిణం చేదాం;
నాట్యప్రదర్శనాన్ని ఏర్పరచుకుందాం.
లేమినుంచి పరిపూర్ణంగా పుత్రీర్ణతకలిగించే నృత్యం,
డబ్బీలో పడేసిన దేముడి సొమ్మునంతా
పేదవాళ్లందరికీ సమానంగా పంచి పెడదాం:
మహనీయులారా—మీఅందరికీ నచ్చితే
ఇదిగో నృత్యం—ఇప్పుడే ఏర్పాటు చేయండి!
యుద్ధబాధితుల రక్షణగృహాల లిమిటెడ్ లో
నాకున్న వాటాలలోంచి ఒకదాన్ని
విరాళంగా ఇవ్వదలిచాను నేను మాత్రం.

ఒక కంఠం : కాని స్త్రీలో మరి?

బ్యాంకరు 1 : నీ కొకావలసినంతమంది.
అందమైన అమ్మాయిల్ని

ఐదువందలమందిని తీసుకురమ్మని
పోర్టరుతో చెబితే చాలు. ఈ లోగా—

బ్యాంకర్లంతా: ఇదిగో మా విరాళం.
ఇదిగో మా నాట్యం.
డిబ్బీలో దేముడి సొమ్ము
ఇక పేదవాళ్ల కైంకర్యమ్ము!

[ బంగారు నాణాలు గలగలమని [illegible]
సంగీతం. బ్యాంకర్లంతా [illegible]
డెస్కు చుట్టూరా [illegible]—
నాట్యాన్ని చేస్తూండగా [illegible]
చీకటి....]

# చిత్రం మూడు

[రంగస్థలం చీకటిలోనే వుంటుంది. ప్రజా సామాన్యం పాడుతున్న బృందగానం విని పిస్తూంటుంది. (చాలదూరంనుంచి)]

మంది: అనంతకాలాల నుంచీ మనం
బంధీకృతమై పడి వున్నాం
నభోవీధి నంటే మేడలు గోపురాలు
గల నగరాల అగాధాలలో మనం,
నరులను వెక్కిరించే యాంత్రిక విధానాల
బలివితర్దిపై అచేతనంగా పడివున్నాం మనం.
చీకటి కన్నీటి రాత్రులు ముఖాలపై
క్రీనీడలు క్రమ్ముతున్నాయి మనకి;
అనంతకాలాల నుంచి మనం
దీనులం, తల్లిలేని పిల్లలం;
ఫ్యాక్టరీల కందకాల సుడిగుండాల
లోతులనుంచి మనకంఠాలు పెల్లగ్రక్కతా
యార్తనాదాలు; నిర్మలమగు ప్రేమలతో
మనమెప్పుడు జీవిస్తాం? మనోభీష్టాలు
తీరే సంతృప్తితో మనమెప్పుడు పనిచేస్తాం?
మనకింకెప్పుడయా విముక్తి?

[రంగస్థలం కాంతివంత మవుతుంది. ఒక విశా
లమైన హాలు. వేదికపై సన్నగా
పొడుగ్గా వున్న టేబిలు; ఎడమ ప్రక్కగా
స్త్రీ కూర్చుని వుంటుంది. కార్మికులు -
స్త్రీలు పురుషులూ, హాలులో క్రిక్కి-
రిసి ఉంటారు.]

కార్మిక యువతుల బృందం :

కాబట్టి యుద్ధాలు కొత్తయుద్ధాల్ని కంటున్నాయి !
మనం యజమానుల అడుగులకు మడుగులొత్తం ఇకపై,
భయంతో తొలగిపోవడం గాని, మన
ప్రయోజనాలను చల్లార్చు కోవడంగాని,
ఇక ముందెప్పుడూ జరుగదు. మన కార్మికులంతా
ఒకే వజ్రదేహంతో యంత్రాలను డైనమైట్ల
పాలొనరిస్తారు. ఫ్యాక్టరీ లన్నిటినీ గాలిలోకి
వెదజల్లేస్తారు—రేపే ! కారణమేమంటే;
యంత్రాలు మనల్ని జంతువుల మందల్లాగ
తయారుచేసి వధ్యశాలలకి తోలుతున్నాయి.
యంత్రాలు మనల్ని దూరలవాటు బురదల్లోకి
కూరేస్తున్నాయి; ప్రతిరోజూ యంత్రాలు మనల్ని
చావగొట్టి, మన యెముకలతో మేకులూ
రెవెట్లూ, స్క్రూలూ తయారు చేస్తున్నాయి—
అరంగుళం స్క్రూలూ, అంగుళాలస్క్రూలూ—
మనకన్నులురాలి పడేదాకా, మనచేతులు వాడి పడేదాకా;
మనసజీవ శరీల మీంచి నడిచి వేగంగా
వెళ్లిపోతూనే ఉన్నాయి; కాబట్టి—

ఫ్యాక్టరీలు—నశించాలి!
యంత్రాలు—నశించాలి!!

ఒక కంఠం: [ప్రతినినాదం చేస్తూ] నశించాలి—ఫ్యాక్టరీలు!
నశించాలి—యంత్రాలూ!!

స్త్రీ: నేనుకూడా గ్రుడ్డిగా- నిరాశా
పూరితంగా, హతంగా. ఉండేదాన్ని!
నన్నుసైతం యంత్రాలు నలగ్గొట్టి,
మింగి సర్వనాశనం చేసేశాయి;
నేను గొంతెత్తి అరిచేదాన్ని; 'వాట్ని
ఛిన్నాభిన్నం చేయండీ!' అని దీనంగా....
కాని అదంతా ఒకస్వప్నం మాత్రమే!
అది నీకన్నుల కాంతుల్ని కంగాళీచేసే
పీడకల మాత్రమే! ఓ బిడ్డల్లారా,
అంధకారంతో భయకంపితుల్లారా!
ఇదిగో చూడండి—ఇది ఇరవయ్యో శతాబ్దం
కాబట్టి—ఈ వివాదం విచారణలో నిర్ణయం
తేలిపోతుంది త్వరగా, ఈ భూతలమంతా
డైనమైట్ల ప్రబలశక్తితో తుత్తునియలై
చెల్లాచెదరౌతుంది. ఫ్యాక్టరీలు పూర్తిగా విధ్వంసం
కావించబడతాయి. మళ్లీ నవోన్మిషితవసంతం
వచ్చేలోగా పూర్వంకంటే కౄరంగా లేచి విజృం
భిస్తాయి. కాబట్టి—ముడిసరుకులుగా జనం
ఉపయోగించబడే విధానంపై యాజమాన్యం
వహించరాదింక ఫ్యాక్టరీలు!

స్వచ్ఛంల జీవితానికి ఫ్యాక్టరీలు-బానిసలు కావాలి;
మానవుని అంతరాత్మ ఫ్యాక్టరీల పసుశక్తిని జయించాలి!

కార్మికయువకుల బృందం :

అయితే ఫ్యాక్టరీలతో కూడా మనం నశించి పోదాం.
కోపంతో, తాపంతో—ద్వేషపు మాటలతో—
మనకాలాన్నీ బలాన్నీ వ్యర్థం చేసుకుంటున్నాం.
యజమానులు నిర్మించుకుంటున్నారు దివ్యసౌధాలు.
కాని, కుళ్లిపోతున్నారు మురికికూపాలలో మనసోదరులు-
పచ్చికమైదానాలు, రంగురంగుల పూవుల పాటలు,
వెచ్చని అనుభవాలు, చిత్రమైన నాట్యాలు, ఆటలూ—
మనచుట్టూరా గుమిగూడి కుసుమించాలి.
రాత్రుల విశ్రాంతికాలాల్లో అందాలగురించి చదువుకోవాలి
స్వర్గానికి వినిపించేలాగ కేరింతాలు కొట్టాలి;
విజ్ఞానపిపాసతో మనబ్రతుకులు అర్రులు సాచాలి;
అయితే జీవితంలోని మంచినంతట్నీ వాళ్లు స్వాధీనం
చేసుకోవడంవల్ల మనకది కీడుగా మారిపోయింది....
జీవనసారం అప్పుడప్పుడు మనల్ని—నాటకాలలో
థియేటర్లలో సోకి హాయిగా పలుకరిస్తుంది;
అతి మృదులంగా, అతి సుతారంగా, నాజూకుగా
తన సౌందర్యంతో మనల్ని వెక్కిరిస్తూంటుంది.
వాళ్లు మనయవ్వనాన్ని స్కూళ్లలోనే నాశనం చేసేశారు.
మన ఆత్మల్ని ఛిద్రం చేశారు. మన ఆనందాన్ని చిత్ర
వధ చేశారు.
అంచాతే మన బ్రతుకులు గొంతెత్తి వాంఛల్ని ప్రకటి
స్తున్నాయి.

కరడుకట్టిన దారిద్ర్యాన్ని ప్రదర్శిస్తున్నాయి నగ్నంగా;
అనునిత్యం లేమితో సలసల మరుగుతున్నాం మనం;
కంపుకొడుతున్న ఆవిరిలాగ నిత్యం తేలుతున్నాంమనం.
అంతకన్నా అధికులమా ఈనాడు మనం ?
ఇకపై దేనికోసమూ నిరీక్షించం మనం !
ఉప్పెనలా విజృంభించి సాగిద్దాం గమనం !!

వ్యవసాయకూలీల బృందం :

ధరణీమాత హృదయం నుంచి దూరంగా
తరిమేశాయి వేట కుక్కలు మనల్ని.
పొలాలన్నిట్నీ కొనేస్తున్నారు ధనస్వాములు.
బజారు గల్లీలోని భోగంచానని కొన్నట్టే
కొనేస్తున్నారు యజమానులు; ఆమెతో
ఆమె అభిమానంతో జూదమాడుతున్నారు.
మనకు ప్రియమైన పుడమితల్లి రొమ్ములనుంచి
దూరంగా విసిరేస్తున్నారు.
కరుకై పోయిన మనచేతుల్ని దూరుస్తున్నారు
మందుగుండు ఫ్యాక్టరీల చక్రాల్లోకి.
అక్కడే రాలి పడిపోతున్నాం మనం.
అప్పుడే వాడిపోతున్నాం మనం.
విషాదగ్రస్థ నగరాలు విచ్ఛిన్నం
చేస్తున్నాయి మనబలాన్ని—
మనకి భూమి కావాలి !
భూమి అందరిదీ అవ్వాలి !

హాలులోని మంది : అందరికీ భూమి !

స్త్రీ:

పేదవాళ్ళ వీధుల్లోంచి నేను నడుస్తున్న సమయంలో—
మట్టిరేణువుల్లాంటి వానచినుకులు జలజలా కురిశాయి;
పూరిగుడిసెల కప్పుల్లోంచి వర్షం పిలపిలా కారింది,
ఉన్నఒకే పడకగది గోడలమీద కుక్కగొడుగులు
మొలిచాయి;
అప్పుడో రోగిష్టి మనిషి నంగినంగిగా సణుక్కుంటున్నాడు;
'ఇంతకన్నా వీధులేనయం'—అనుమానమెందుకు ?
తప్పకుండా అవే బాగున్నాయి. మనం పందుల లాంటి
గూళ్ళలో నివశిస్తున్నాం; కాదామరి ? తప్పకుండా
ఇవి పందులగూళ్ళే!' అతని కళ్ళు సిగ్గుపడ్డాయి.
అనుమానం కుతకుత వుడికింది నాలో!
అయితే అన్నల్లారా!— ఈ విచారాలకంచెల్ని
దాటే దారీ తెన్నూ తెలుసామీకు ?
మన నీరసపు బ్రతుకుల్ని చుట్టుకున్న
ఈతిబాధలకి ఒక్కటే విరుగుడుంది.
తుపాకీ మడమల్ని ద్వేషిస్తున్నవాళ్ళెవరు ?
లెండి, సమ్మెచేయండి! ఇకముందు
మనలో ఒక్క చెయ్యికూడా చక్రాల్ని త్రిప్పవు!
సమ్మె చేయడమే యోగ్యమైన కార్యం
అప్పుడు మాత్రం మనం మేరుపర్వత బలాఢ్యులం
కాగలం. బలహీనులమైన మన సంకెళ్ళను
తుత్తునియలు చేసేందుకు హింసావిధానం
కోరనే అక్కర్లేదు. మానవుడు సృష్టించిన
ఆయుధాలేమీ భూమిలో జయించలేవు మనల్ని.
నోరులేని మనసైన్యాలన్నింటినీ పిలువండి!

సమ్మెకు ఆయత్తం చేయండి! నే చెప్పేది వినండి:
నేను సమ్మెకు పిలుపిచ్చాను! గత ఐదారు
సంవత్సరాలనుంచీ మన శరీరాల్ని మింగేస్తోంది
మహాకాళి! మనవీధుల్లో పిల్లలతోసహా తల్లులు
కుప్పగా కూలిపోతున్నారు—వాళ్ళని నములుతున్న
ఆకలితో నీరసంగా మారి, గర్భవాసంలోని
శిశువుల భారాన్ని మోయలేక కృంగిపోతున్నారు.
మీ ఇళ్ళనుంచి వెలువడుతున్న అసహ్య దరిద్రం,
అంటుజాడ్యం, హృదయ విదారకమైన ఉన్మాదం;
ఆకలికర్కశత్వం తీక్షణంగా చూస్తున్నాయి:
కాని అక్కడే, సరిగాచూడు, వాటిమీదే
ధనం సంచులు తమ త్రాగుడు మత్తంతా
కక్కుకుంటున్నాయి. అశేషశ్రమ ఫలితమైన విజయం
నురుగులు తేరి పొంగుతున్న బ్రాందీలో మునిగిపోతుంది.
స్వర్ణ వితర్దికి చుట్టూరా ఆవేశపూరిత రాజవైభవాలు
విలయతాండవం చేస్తాయి. కాని, వాటి మీదుగా
నీ దృష్టిని ప్రసరించు—కనిపిస్తున్నవి, నీ సోదరుల
పాలిపోతున్న ముఖాలు! సాయంత్రపు శీతగాలికి
చల్లగా కొయ్యబారిపోతున్న వాళ్ళ శరీరాలుతాకి
చూస్తున్నావా? లంచంతిని బలిసిన అవినీతిని
పసిగడుతున్నావా? కీచుగొంతుల మాతల్ని
వింటున్నావా?—చెప్పవయ్యా, చెప్పు:
వాళ్ళేరుస్తున్నారు వింటున్నావా!
"ఇంక మీవంతు వచ్చింది!
శక్తిహీనులమైన మేం,

తుపాకీ కొసలకు గొలుసులతో
బంధించబడ్డ మేం, అరుస్తున్నాం—
వినండి: ఇదిగో మీరే, మాకు
సహకరించండి! మీరే మాకోసం
వారధి కట్టండి!"....
ఇదిగో మళ్లీ చెబుతున్నాను వినండి: సమ్మెకు
నేనే పిలుపిచ్చాను! అయితే, ఇకముందు
ఆయుధాల ఫ్యాక్టరీని మేపేవాళ్ళెవరేనా వుంటే—
వాళ్ళే తమ సోదరులకి ద్రోహం తలపెడుతున్నా
రన్నమాట—ద్రోహంకన్నా అధికమైన ఘోరమే
తలపెడుతున్నారన్నమాట—భ్రాతృహత్యకు
పూనుకున్నారన్నమాట!

ఇదిగో, సోదరీమణులారా!
నిత్యం బాధలకు గురవుతున్న మీ పురుషుల్ని
గుర్తించండి! ఆలోచించండి! నేను సమ్మెకు పిలుపిచ్చాను!

హాలులోని మంది: మేము సమ్మెకు పిలుపిచ్చాం:
మేము పిలుస్తున్నాం; 'సమ్మె' అని!

[నామరహితుడైన ఒక మనిషి జనసమూహం
నుంచి బైటకు వస్తాడు. వేదికమీదికి
వేగంగా పరుగెడతాడు, టేబిలుకు కుడి
ప్రక్కగా నించుంటాడు....]

నామరహితుడు ఒంతెన కట్టదల్చుకున్నవాడు పునాదిగురించి
తీవ్రంగా ఆలోచించుకోవాలి. ఈవేళ సమ్మె
చేయడమంటే పునాదిదిట్టం లేకుండా

వారధి నిర్మించడమన్నమాట. మనకీనాడు
కావలసింది సమ్మె మాత్రమేకాదు. ఒక్కసారి
విజయవంతంగా సమ్మెచేయడమంటే శాంతి
పరిస్థితుల్నుంచి ఉబ్బెత్తుగా ఉద్భృతాన్ని కలిగించడం
అన్నమాట; ఇక సంధి ఏమాత్రమూ పనికిరాదు.
యుద్ధమనేది శాశ్వతంగా అంతరించి తీరాలి!
కాని మొదట తీవ్రమైన పోరాటం జరగాలి! అదే
ఆఖరిది కావాలి!

అయితే యుద్ధం అంతరించడం
వల్ల ఏమిటి ప్రయోజనం? అనేప్రశ్న జనిస్తోంది:
నిజమే, నీవు సృజించిన శాంతిలో కూడా
నానుదుటి రేఖలు మార్పులేకుండా నిలచిపోతే,
ఏమీ ఉపయోగం లేదు; ఈప్రక్కగా చూస్తే
మహాశాంతి ప్రదర్శనమూ పాతకర్మల కర్కశ
గమ్యస్థానమూ కనిపిస్తాయి;—అ ప్రక్కగా చూస్తే
మహాసంగ్రామమూ, నూత్నవ్యవస్థాజననమూ
కనిపిస్తున్నాయి; కాబట్టి, ఓ అవివేకులారా,
ఈ పునాదులను బ్రద్దలు కొట్టండి! తుత్తునియలు
చేయండి! ఇదిగో చెబుతున్నాను, ఈపాత
పునాదుల్ని ఛిన్నాభిన్నం చెయ్యండి!—అ తర్వాత—
మనజీవితస్వరూపాల్ని పోతపోస్తున్న బంగారపు
ఒంటిస్థంభపు మేడల్ని పగవుప్పెనతో తుడిచిపెట్టండి!
అప్పుడుగాని వాసయోగ్యమైన నూత్నవ్యవస్థ రూపవదదు;
ఫ్యాక్టరీలకు కార్మికులు వారసులు, అవెంతమాత్రం

'పెట్టుబడి' మహాప్రభువుకి చెందవు. ఒంగిన
మనమూపులపై ప్రభువులను మోస్తూ, ఉన్నతంగా
వారిచూపులను ప్రసరింపచేస్తూ, దూరపుధన
రాసులనాశగా అంచనాలు వేస్తూంటే—చూసి
మనం తృప్తిపడేకాలం గతించి పోయింది.
దూరదేశాల ప్రజల్ని స్వాధీనపరుచుకొని,
బానిసలుగా ఒనరించే యుద్ధతంత్రాలకు
అవకాశం ఇచ్చేకాలం గతించి పోయింది.
కాగితాల దొంతర్లుద్రేకం కలిగించే కీచు
గొంతులు : "నీ దేశం ! నీ దేశంకోసం !" అని
ఘోషించే అరపుల బురదల్లో—'నాకోసం !
నాకోసం !' అని ఉద్దేశించే ప్రభువుల
వాస్తవ కంఠస్వరాలు, దిగబడి మరుగున
పడిపోయేకాలం గతించి పోయింది !
ఆకాలం గతించి పోయింది !
సమస్తభూముల ప్రజలంతా ఒక కంఠంతో :
'ఫాక్టరీల సంపదలకు కార్మికులే వారసులు ;
సర్వశక్తులకు, అధికారాలకు కార్మికులే అధినాధులు !
అంతా అందరికోసం ! !' అనిఘోషిస్తున్నారు.

సమ్మెకన్న మించిన దానికె పిలుపిస్తున్నాను,
సంగ్రామానికె నేనిప్పుడు పిలుపిస్తున్నాను,
మహావిప్లవానికే ఈ రోజున పిలుపిస్తున్నాను !
అదిగో అక్కడి శత్రువు మన వర్తి
ఉపన్యాసాలకు లేశమంత కూడా

జంకడు; మీశక్తి నేడు శత్రువు శక్తితోటి
ఉజ్జీ అగుతున్నది! నేడు కావలసింది,
సైనికబలం!

ఒక కంఠం: ఆయుధాలో!

నామరహితుడు అవును, కావాలి మీఅందరికీ ఆయుధాలు.
కాబట్టే ఠాణాపై ముట్టడి తుఫానువీచండి;
స్వాధీనం చేసుకొండి ఆయుధాలు.
అప్పుడు మాత్రమె మీ సమరం
విజయం ఘోషిస్తుంది!

స్త్రీ: వినండి నా మాటలు!
సమ్మతించను దానికి—

నామరహితుడు ఆగాలి కామ్రేడ్!
చేతుల జోడిపులూ, ప్రార్ధనలూ,
ఉద్రేకపు వాదనలూ
ఫలితాలను ప్రసరించవు;
మంత్రాలకి చింతకాయలు రాలవు
వృక్షాన్ని నరకాలంటే—
కావాలికదా గొడ్డలి?

స్త్రీ: వినండి నా మాటలు
తాజా హత్యాకాండకు
నేనంగీకరించను.

నామరహితుడు నీవింక ఆగాలి కామ్రేడ్!
నీకేమిటి తెలుసు?

మా అవసరాన్ని గుర్తించడమే నీవిధి.
కాని నీ వెప్పుడేనా గనిలో
పదిగంటలకాలం పనిచేశావా ?
ఇల్లులేక తిరుగుతూంటే నీ బిడ్డల్ని
మందలుగా బందిలదొడ్డికి తోలేరా ?
గనిపనిలో పదిగంటలు కష్టపడ్డం—
పందుల గుడిసెల్లో సాయంత్రం విశ్రాంతి,
ప్రతిరోజూ ఇవేకదా ? మందిజనుల ఖర్మం !
నువ్వు మంది జనం కావు; నేను
మంది జనాన్ని ! మంది జనమే విధి !

హాలులోని మంది : అవును నిజం.... మందిజనమేవిధి !

స్త్రీ : ఒక్కటి మాత్రం యోచించాలి,
మందిజనం నిస్సహాయులు,
మందిజనులు బలహీనులు,

నామరహితుడు నీవెంత అంధురాలివి !
మందిజనం అధినేతలు !
మందిజనం మహాశక్తి !

హాలులోని మంది : అవుని నిజం.... మహాశక్తి !

స్త్రీ : నాలోపలి భావాలు చీకటిగా అలుముకొంటున్నాయి—
ఆవేశపూరితంగా అర్రులు సాచుతున్నాయి, కానీ
'కాదు' అని నా అంతరాత్మ బొబ్బరిస్తోంది.

నామరహితుడు ఆ విషయం గురించి నీవింక మాట్లాడకు కామ్రేడ్ !
ఆశయంకోసం నీ మనోభావాల్ని అపుచెయ్యి.

ఒక వ్యక్తినీ, అతని అనుభూతుల్నీ-అతని అంతరాత్మనీ
వాళ్లు పరిగణిస్తారా? మందిజనాలు పరిగణిస్తారు!
రక్తపాత పూరితమైనది
ఇవొక్కటే సంగ్రామం—అటుపై సుస్థిరశాంతి!
కనక దీని విషయం పునరాలోచించి అంగీకరించాలి.
గతకాలపు చరిత్రలాగ యుద్ధాల్ని కడుపులో దాచుకొనే
హాస్యాస్పదమైన శాంతి కాదిది—బలవంతులు
బలహీనులు మీద చేసే యుద్ధం కాదిది;
దోపిడీకీ దురాశకీ అవకాశం కలిగించే సంగ్రామంకాదిది;
ఆలోచించు: ఈలోకపు కీడులకిది అంతం!
ఈ తరుణంతో ప్రజలందరికీ
కోటికోట్ల వెలుగులతో స్వాతంత్ర్యం ఉదయిస్తుంది.
నాసలహా ఓటిమాటలేమో నీవే ఆలోచించుకో!
సమరం మనకింక అత్యవసరం, అయితే నీ మాటలు
మనలోమనకే చీలికలు కలిగిస్తాయి—ఆశయం
కోసం పరింకేమీ మాట్లాడకు.

స్త్రీ : నీ.... వే ఆ.... మందిజనం.
నీ.... మాటే .... సమంజసం.

నామరహితుడు ఈ వారధికై పునాది నిర్మించండీ!
మన మార్గానికి అడ్డంగా నిలచిన వాడెవడైనా,
నలిగిపోయి నశించాలి!
మంది జనపు మహాకృత్యం!

హాలులోని మంది : (బైటికి త్రోసుకు వస్తూ) : మహాకృత్యం!

(రంగస్థలంలో చీకటి వ్యాపిస్తుంది)

# చిత్రం నాలుగు

## [ఒక స్వాప్నికజగత్తు]

[బాగా ఎత్తైన గోడల ఆవరణంలో గల కోట్ల స్థలం ద్యోతక మవుతుంది. రాత్రి, కోర్టులో మధ్యగా నించున్న లాంతరు నేలమీద గుడ్డి వెలుతురు చిమ్ముతూ ఉంటుంది. కోర్టులో ఒక మూలగా ప్రజల సెంట్రీలు కనిపిస్తూ ఉంటారు.]

మొదటి సెంట్రీ (పాడుతూ) నన్ను కన్నది నాతల్లి—
మురికి కూపంలోన ఒకనాటి రాత్రి
లాలాల........లాలా
హం....హం....హం....

రెండవ సెంట్రీ కని విడిచి పెట్టాడు మాతండ్రి
నను మరిచి వెళ్లాడు మాతండ్రి
చేతిలో చిప్పతో ఒకరాత్రి.

సెంట్రీలందరూ లాలాల........లాలా
హం....హం....హం....

మూడవ సెంట్రీ మూడేళ్లు నన్నుచట దాచారు—
ఆఖరికి నాటి కిదిగోను,
పంజరంలో పిట్ట పరుగుతీసింది.

సెంట్రీలందరూ లాలాల........లాలా
హం....హం....హం....

[ ఎక్కడనుంచో నామరహితుడు ప్రవేశిస్తాడు.
చప్పుడు చేయని అడుగులతో దెయ్యం
లాగ నడుస్తాడు. లాంతరు ప్రక్కగా
నుంచుంటాడు. ]

మొదటి సెంట్రీ నన్ను పోషించాడు మాతండ్రి
కానీ, దబ్బివ్వటం మరిచిపోయాడు.

అందరూ : లాలాల........లాలా
హం....హం....హం....

రెండవ సెంట్రీ వాళ్లందరూ చెప్పినట్టే—నాతల్లి
బాధలన్నీ పొందుతూనే—నాతల్లి
వీధులన్నీ తిరుగుతుంది.

అందరూ : లాలాల........లాలా
హం....హం....హం....

మూడవ సెంట్రీ ఆనాటి ఎన్నికలరోజున
పెట్టుబడిదారుడూ నాపైన
ఫిర్యాదు చేశాడో

అందరూ : లాలాల........లాలా.
హం....హం....హం....

నామరహితుడు నాట్యం ప్రారంభించండి,
నేను—వాద్యం ప్రారంభిస్తాను—

సెంట్రీలు : ఎవరక్కడ ? ఆగండి !

నామరహితుడు   పేరులేని మిమ్మల్ని
పేరేమిటని నే నడిగానా ?

సెంట్రీలు :   నీ అనుమతి పత్రం ఇలా ఇయ్యి.

నామరహితుడు   మంది జనులు నామరహితులు.

సెంట్రీలు :   నామరహితులు
ఔను, మాకులాగే !

నామరహితుడు   కార్యాచరణకి పురోగామినైన నేనే
మీ నాట్యాన్నికూడా ప్రారంభం చేస్తాను.

[ నామరహితుడు వాద్యసంగీతం ప్రారంభిస్తాడు. భీభత్సప్రేరేపక ధ్వనులు— ఒక్కొక్కప్పుడు చల్లగా హాయి గొల్పేవి, మరో అప్పుడు మహోద్రేకంతో తుఫాను వీచేవీ—మరణశిక్ష విధించబడిన ఒకమనిషి, మెడలో చుట్టబెట్టిన తాడుతో చీకటి నుంచి వెలుపలికి వస్తాడు. ]

శిక్షితుడు :   మావలెనే మరణశిక్ష లనుభవించిన
అసంఖ్యాక నిర్భాగ్యుల తరపున మమ్మల్ని
కరుణించవలసిందిగా ఆఖరిసారి కోరుతున్నాము :
మమ్మల్ని కూడా నాట్యానికి ఆహ్వానించండి.
నాట్యమే సమస్తవస్తు సముచయానికీ మూలబిందువు :
నాట్యం నుంచే ప్రాదుర్భవించింది జీవం,
మాలోపలి కాంక్షల నృత్యం,

గడచిన సంవత్సరాల నృత్యం,
మృత్యుదేవి భీభత్స తాండవం,
ఈ నాట్యానికి మమ్మల్ని ప్రేరేపిస్తున్నవి.

సెంట్రీలు : మరణ దండన విధించబడ్డ వాళ్ళ
ఆఖరి కోరికలు ఎల్లప్పుడూ తీర్చబడతాయి!
కాబట్టి, మీ కిదే మా ఆహ్వానం.

నామ రహితుడు రండి! ఇక్కడ మనమంతా
ఒక్క మాదిరిగానే—సీడలం.

శిక్షితులు : మరణశిక్ష విధించబడిన ఓ నిర్భాగ్యుల్లారా!
మీ శిరస్సుల నుంచి వ్రేలాడుతున్న
మృత్యువుకప్పిన నల్లని తెరలను
ఇక తొలిగించండి, నిటారుగా నిలవండి!
జీవితాని కంతిమ నాట్యంచేయండి!

[మరణశిక్షలు విధించబడిన మిగిలిన మనుష్యులుకూడా, మెడచుట్టూ వ్రేలాడుతున్న త్రాళ్ళతో. చీకటినుంచి బైటికి వస్తారు. (వేశ్యలతోసహా) కాపలాదారులైన సెంట్రీలతో కలిసి నామరహితుని చుట్టూరా నాట్యం చేస్తారు.]

సెంట్రీలు : (పాడుతూ) ఒక మురికి కూపాన నన్నుకన్నది ఆమె....
కని విడిచి, నను మరచిపోయాడు అతడు....

[అలాగే నాట్యం చేస్తూంటారు. కొంచంసేపు గడిచిన తర్వాత]

చెరసాలలో నన్ను బంధించినాదు....

[అలాగే నాట్యం చేస్తూంటారు. ఉన్నట్టుగా నామరహితుని వాద్యసంగీతం ఆగి పోతుంది. వేశ్యలూ, శిక్షితులూ ఒక మూలకు పారిపోతారు. రాత్రి గాఢాంధ కారం వాళ్ళ స్వరూపాల్ని భ్రమింపచే స్తుంది. సెంట్రీలు తమ యథాస్థానా లకి చేరుకుంటారు. నామరహితుని చుట్టూరా నిశ్శబ్దం మూగుతుంది. సెంట్రీ ఆకారంలో మార్గదర్శి గోడల్లో పల్నించి వస్తాడు. స్త్రీని దగ్గరగా చేర్చు కుంటాడు.]

మార్గదర్శి : నడిచేందుకు ఈ మార్గం దుస్సాధ్యం
అయితేనేం, దారిచివర ఫలిస్తాయి
పారితోషికాలు !
అదిగో అటువైపు చూడు !
ఆరంభించిందపుడే మహానాటకం.
ఆవేశపుటుద్రేకం నిను ప్రేరేపిస్తే
పాల్గొనడం మానకు.

[ఒక సెంట్రీ మరోఖైదీని లోపలికి తీసుకు వస్తాడు. (ఆ ముఖం ధర్మముఖాన్ని పోలిఉంటుంది.) అతనిని నామరహి తుని వద్దకు కొనిపోతాడు.]

నామరహితుడు ఇతన్ని విచారణా సమితి శిక్షించింది.

సెంట్రీ : కాదు, తన్ను తానే శిక్షించుకున్నాడతడు—
మనపై కాల్పులు సాగించాడు మరి.

ఖైదీ : మృత్యువు !

నామరహితుడు భయపడుతున్నావా ?
సెంట్రీ, వింటాడతను విశదపరచు:
మరణదండనల మనకి నేర్పినవారెవరు ?
మనల్ని సాయుధులుగా చేసినవారెవరు ?
'వీరుడ'వని, 'మహత్కార్యాల'ని మనల్ని పొడిగిన
వాళ్లెవ్వరు ?
హింసల కంకితమైపోయిన వాళ్ళెవ్వరు ?

సెంట్రీ : స్కూళ్ళూ, బారకీసు గోడలు;
అనంతమైన యుద్ధాలు.

నామరహితుడు సైనికబలగం కూడా !
తుపాకులెందుకు కాల్చావు ?

ఖైదీ : నే నీ ప్రభుత్వానికి ప్రమాణికంగా
విధేయత ప్రకటించుకున్నాను.

నామరహితుడు అయితే నువ్వు నమ్మిన ఆశయంకోసం—
మరణించటానికి వెనుదీయవన్నమాట.

సెంట్రీలు : గోడకి చేరువగా నడిచి—నిటారుగానించో.

నామరహితుడు రైఫిల్లో తూటాలు బిగించబడ్డాయా ?

సెంట్రీలు : బిగించి సిద్ధంగా ఉన్నాయి.

ఖైదీ: (గోడదగ్గర) జీవితమా!
ఓహో జీవితమా!

[స్త్రీ మార్గదర్శి కౌగిలినుంచి విడిపించుకుని
బైటపడుతుంది.]

సోనియా: అప్పుచేయండి కొల్పడం!
అతడే నా భర్త; మీరుకూడా నాలాగే
దయతో అతన్ని క్షమించండి.
అన్ని సంఘర్షణలకన్నా మించిన
బలాఢ్యమైనది క్షమాదృష్టి!

నామరహితుడు ఎప్పుడేనా వాళ్లు
క్షమించారా మనల్ని?

సోనియా: స్త్రీ పురుష జనాలకోసం ఎప్పుడైనా
వాళ్ళు యుద్ధం సాగించారా?
సమస్త మానవజాతికోసం ఎప్పుడైనా
వాళ్ళు పోరాటం సాగించారా?

నామరహితుడు ఆ విషయాలన్నిటినీ పరిగణిస్తుందిలే మహాజనం.

సెంట్రీలు: వెనక్కి గోడకి చేరువగానడు!

ఒక సెంట్రీ: క్షమాదృష్టి బలహీనత....
నిన్ననే మనశత్రు శిబిరం నుంచి
పారిపోయి వచ్చాను.
గోడల్లో బంధించి కొరడాలతో
నాఒళ్లంతా ఛిద్రం చేశారేవాళ్లు!

నన్ను వధించడం కోసం నియమించబడ్డ జవాను
ఎప్పుడూ నావెనకాలే కాపలా కాశాడు.
నన్ను నిర్బంధించి నాచేతులతోనే
నా సమాధి త్రవ్వించారు వాళ్లు.
ఫొటోగ్రాఫర్లు కొత్తకొత్త చిత్రాలతో
డబ్బుచేసుకొనేందుకు నిరీక్షించారు.
ఈ హత్యాకారులు మనల్ని వెక్కిరించి,
పరిహాసంచేసే అవకాశం కలిగించేట్టయితే,
విప్లవ కార్యక్రమంమీద నేనుమ్మేస్తాను.
మళ్ళీచెపుతున్నా వినండి— విప్లవంమీద ఉమ్మేస్తాను.

సెంట్రీలు : వెనక్కి నడు!

[ఆ ఖైదీ ముఖం ఒక సెంట్రీ ముఖంగా మారుతుంది. అప్పుడు స్త్రీ సెంట్రీతో మాట్లాడుతుంది.]

సోనియా : నిన్నటి రోజున నీవే గోడవెనుక దీనంగా
నిలచావు; నేటిదినంకూడా నీవే గోడకి
చేరువగా దీనంగా నిలబడుతున్నావు.
నేటిదినం గోడవెనుక చేరువగా నిలచినవాడవు నీవే!
ఓ మనిషీ నీవే అతనివి!
నన్ను నీవు గ్రహించు మనిషీ! నీవే అతనివి.

సెంట్రీ : మందిజనం మాత్రం పరిగణిస్తుందా విషయం.

సోనియా : కాదు, మనిషి మాత్రమే పరిగణిస్తాడు.

సెంట్రీలందరూ కాదు, కాదు పరిగణించేది మహాజనం మాత్రమే!

నాలుగు

సోనియా : సర్వమానవాళి సౌఖ్యం కోసం
నా జీవితాన్ని నేనే అర్పిస్తున్నాను.

[ సెంట్రీలు అసహ్యంగా నవ్వుతారు. ]

సోనియా : (భర్తప్రక్కనే నించుంటుంది) ఇంకా చూస్తారేం !
అయితే నన్ను కాల్చిచంపండి !
నా రాజీనామా ప్రకటిస్తున్నాను.

[ రంగస్థలంలో చీకటి వ్యాపిస్తుంది. ]

## చిత్రం ఐదు

[హాలు కిటికీలలోంచి ఉదయకిరణాలు ప్రస
రిస్తూ ఉంటాయి. వేదికమీద విషాద
పూరితమైన క్రీనీడలు. పొడుగాంటి
టేబిలుకు ఎడమప్రక్కగా స్త్రీ కూర్చొని
వుంటుంది. నామరహితుడు కుడివై
పుగా కూర్చుని వుంటాడు. హాలు
ద్వారబంధాల వద్ద ప్రజల సెంట్రీలు
కావలివుంటారు. హాలులో విడివిడిగా
కార్మిక స్త్రీలు పురుషులు ముడుచుకొని
టేబిళ్ల పైకి వంగి కూర్చొని వుంటారు]

స్త్రీ : ఈ అంతిమ ఘడియలలో
ఏమైనా వార్తలు చేరాయా?
నేను నిద్రపోయాను; క్షమించు కామ్రేడ్!

నామరహితుడు ఏవో వార్తలు—వార్తలు,
వస్తూనేవున్నాయి కబురుమీద కబురుగా.
యుద్ధమన్నతర్వాత యుద్ధమే, విభిన్న
శక్తుల మధ్య సాగు మహారక్త సంగ్రామం!
చడీచప్పుడూ లేకుండా జరిగిపోతుంది నిర్ణయం.
గతరాత్రి రెండు జాములకు పూర్వమే
మనం స్టేషన్ ఆక్రమించుకున్నాం; మళ్ళీ
ఒంటిగంట కొట్టకముందే మనం దాన్ని కోల్పోయాం.

ఇప్పటికీ మన బలాలు కొత్త ముట్టడికోసం
పురోగమిస్తూనే ఉన్నాయి. ప్రస్తుతం పోస్టాఫీసు
లన్నీ మనచేతుల్లోనేవున్నాయి. ఈసమయంలో
తంతివార్తలుమాత్రం బయటికి పంపబడుతూనేఉన్నాయి
ఏ ప్రజల క్షేమంకోసం ఈ మహోద్యమం సాగుతూందో
ఆ ప్రజలకు ప్రతినిత్యం కాలహరణ లేకుండా
ఈ వీరకార్యాల వార్తలు తెలుపబడుతూనే ఉన్నాయి.

శ్రీ : మన కర్తవ్యం, మన ధర్మం !
అవి మహా పవిత్రమైన శబ్దాలు !

నామరహితుడు దొంగముట్టడిని కూడా అంత
కన్నా పవిత్రశబ్దాలతో చెబుతారు వాళ్ళు
విలబెట్టి నిప్పంటించడంకంటె
క్రూరమైన కార్యాలాచరించినప్పటికీ
పవిత్ర శబ్దాలతోనే చెబుతారు దాన్ని
భీషణ సంగ్రామాన్నికూడా
ముద్దుమాటలతోటే పిలుస్తారు వాళ్ళు.

[ కొన్ని క్షణాలపాటు హాలులో నిశ్శబ్దం
ఘనీభవిస్తుంది. ]

శ్రీ : నువ్వెంతచెప్పినప్పటికీ కామ్రేడ్,
దీన్ని నేను భరించలేకపోతున్నాను.
హింసాయుత సంగ్రామం బానిసత్వానికి పునాది.

నామరహితుడు ఆధ్యాత్మికశక్తులతో చేసే సంగ్రామం కూడా
బానిసల్ని చేస్తుంది.

భయపడి కంపించకు కామ్రేడ్,
నగ్నసత్యాల్ని నేను గ్రహిస్తున్నాను.
నేనుకూడ నీలాగే మూర్ఖంగా విశ్వసించి
వున్నట్టయితే, ఈపాటికి సన్యాసం తీసుకొనే వుందును.
అనంతమౌనానికి శిరమొగ్గే వుందును.

[ హాలులో నిశ్శబ్దం శాశ్వతంగా తిష్ఠవేస్తుందా అని పిస్తుంది. 'మొదటి కార్మికుడు' ప్రవేశిస్తాడు.]

మొదటి కార్మికుడు : వార్తల్ని అందించడానికి నేను వచ్చాను:
మనం మూడు పర్యాయాలు స్టేషనుపై ముట్టడి జరిపాం.
అక్కడున్న మైదానం నిండా యుద్ధంలో చనిపోయినవాళ్ల
శవాలు గుట్టలు, గుట్టలుగా వున్నాయి.
శత్రువుకి సైనికబలంలోగాని, ఆయుధబలంలోగాని,
ఏమీ లోటులేదు; విషవాయువుతోటి,
ప్రేలుడు గనులతోటి, జ్వాలాద్రవం తోటి,
యుద్ధం సాగిస్తున్నాడు శత్రువు.

నామరహితుడు మూడుసార్లు పురోగమించి ముట్టడిజరిపారుకదా—
మరి నాలుగోసారి ఏమైనట్టు ?

మొదటి కార్మికుడు : అసలు నాలుగోసారి అనే దెప్పుడూ
సంభవించనేలేదు. శత్రువు మన బలాలపై
మెరుపుదాడి సలిపి విజయం సాధించాడు.

నామరహితుడు మీ భూభాగాల్ని మీరు నిలబెట్టుకొండి.
ఇంకా సాయుధబలాలేమైనా కావాలా ?

మొదటి
కార్మికుడు : మనబలగం ఛిన్నాభిన్నమైంది.

నామరహితుడు మనమలాంటి ప్రమాదాల నన్నింటినీ
ముందుగానే అంచనా వేసుకోవాలి.
ఇలావిను : పదమూడవజిల్లాకి వెంటనే వెళ్ళి
అక్కడ రిజర్వులోవున్న మన ఆదనపు సైన్యాల్ని
తరలించుకురా; వెళ్లు, వేగంగా వెళ్లాలి !

స్త్రీ : అతడు చెప్పాడు, మనజనం చాలామంది
చచ్చిపోయారని; వందలాదిగా విహతులయారని;
నేను ముందుగానే చెప్పలేదా ?
నిన్న చెప్పాను, నేడు మళ్లీ చెప్పాను,
యుద్ధానికి వ్యతిరేకంగా, స్వర్గానికి సైతం వినిపించే
గొంతుకతో నేనరిచానే—అరణ్యరోదనమేనా అది ?
మృత్యువాతపడ్డ నాసోదరుల కోసం నేను
దుఃఖంతో ఆవేదనతో ఉండాల్సిందేనా ?

నామరహితుడు నీ అభిప్రాయాలలో చాలాగందరగోళం
సంభవిస్తోంది. నిన్నటియుద్ధంనాట్లి మనమంతాబానిసలం

స్త్రీ : మరి నేటికి మాత్రం ?

నామరహితుడు నేటి యుద్ధంలో మనమంతా స్వతంత్రులం.

[ఒణుకుతున్న నిశ్శబ్దం]

స్త్రీ : యుద్ధాల్ రెండిటిలోనూ.... మంది.... ....
యుద్ధాల్ రెండిటిలోనూ.... మనిషి.... ....

[ నిశ్శబ్దం చుట్టుకుంటుంది—రెండవ కార్మి
కుడు దూకుడుగా ప్రవేశిస్తాడు. ]

రెండవ కార్మికుడు : మనచేతుల్లోంచి పోస్టాఫీసు పోయింది!
మన మనుషులు పారిపోతున్నారు!
శత్రువునుంచి ఏమీ చిక్కటం లేదు!
ఖైదీల విధిమీద మృత్యుతాండవం!

[ మొదటి కార్మికుడు రంగస్థలంలోకి ఆతృ
తగా ప్రవేశిస్తాడు. ]

మొదటి కార్మికుడు : నేను పదమూడవ జిల్లానుంచి వస్తున్నాను—
నా ప్రయత్నం విఫలమైంది.
వీధులన్నీ శత్రుబలాలతో ముట్టడింపబడ్డాయి,
మనసైనిక నివహం లొంగి పోయింది,
మనజనం ఆయుధాలను శత్రువుకి వశపరుస్తున్నారు,

మూడవ కార్మికుడు : పట్టణం పతనమైంది!
మన శ్రమంతా విఫలమైంది!

స్త్రీ : అవును, తప్పనిసరిగా విఫలమవుతుంది

నామరహితుడు ఇదిగో మళ్లీ చెబుతున్నాను; నిశ్శబ్దంగా ఉండు కామ్రేడ్!
ప్రయత్నాలు ఎన్నటికీ విఫలం చెందవు.
నేటికి మనబలగం బలహీనం కావచ్చు, కాని
రేపే కొత్తపటాలాలు పిడుగుల్లాగ గర్జిస్తాయి.

[ నాలుగో కార్మికుడు దీనంగా అరుస్తూ హాలు
లోకి ప్రవేశిస్తాడు. ]

నాల్గవ కార్మికుడు : వాళ్ళ బలం మహావేగంతో పురోగమిస్తోంది ;
ఎంత దుర్భరమైన కసాయితనమది ;
నా భార్యని కాల్చి చంపేశారు ;
నా తండ్రిని కాల్చి చంపేశారు ;

నామరహితుడు భయంలేదు, వాళ్లు మనమంది జనంకోసం
మరణించిన వీరులు ;....శత్రువు వీధుల్లో
నిర్మించిన బారికేడ్లను అధిగమించండి ;
ఇప్పటికీ మనం శత్రువు నెదిరిస్తాం ;
మనరక్తం తప్పనిసరిగా సద్యఫలితాల నిస్తుంది ;
ఎవళ్లొస్తారో రానీయండి వాళ్లని, మరేం భయంలేదు ;

[కార్మికులు తొడతొక్కిడిగా హాలులోకి చొరబడతారు.]

ఐదవ కార్మికుడు : మన మనుషుల కుత్తుకలను,
పరపరా కోస్తున్నారు వాళ్లు :
పురుషుల్నీ, స్త్రీలనీ, పిల్లల్నీ—అందర్నీ ;
శత్రువుకి పాదాక్రాంతం కాని వాళ్లని
దొరికిన పశువుల్ని కరకుగా నరకినట్టు
చంపుతున్నారు ; పరపరా కోస్తున్నారు ప్రజల్ని.
కాబట్టి మనం సాయుధలం కావాలి :
రణరంగపు ధర్మసూత్రాలు సైనికుల్ని రక్షించాయి,
కాని మనం అడవి జంతువుల్లాగ పేల్చి చంపబడ్డాం.
బోనుల్లోంచి పారిపోతున్న క్రూరజంతువులకు మల్లే
కాల్చి చంపబడ్డాం ; మన తలల మీద ఉన్నదొక్క

విలువ; కాని, బూర్జువావ్యవస్థకి సాయుధు
లైన షైదీలం మనం. సగానికి సగం కాల్చి
చంపబడాలని నేను ఆజ్ఞాపించాను—
మిగిలిన సగం తోటీ ప్రబలమైన మనసైన్యాలు
ఏర్పడతాయి.

నాపరహితుడు నీ సోదరులపైనా నీవు ప్రతీకారం బూనడం....
శతాబ్దాలనుంచీ పాదుకున్న అన్యాయాలమీద
మందిజనాలు కసితో పగసాధిస్తున్నారు
మందిజనులు పగబట్టిన త్రాచులు!

కార్మికులు : ప్రతీకారం!

స్త్రీ : ఆపండి! మీరంతా యుద్ధోన్మాదంతో ప్రలాపిస్తున్నారు.
నేను మీ మార్గానికి అడ్డుకట్ట కడతాను.
ప్రేమానురాగాల పాశాలతో అనుబంధమైన ప్రజలే
మంది; ఒకే ఒక్క—కుటుంబంలాంటి ప్రజలే మంది.
ప్రతీకారం కాదు కుటుంబతత్వం.
కుటుంబం—అసమతలభూతలాన్ని
ఛిన్నాభిన్నం చేస్తుంది; చెడుగుల పునాదులన్నీ
పెకళిస్తుంది; ధర్మం—బీజాలను నాటుతుంది,
మానవజాతి పగసాధించడంలో, తన్నుతానే
ఛిద్రం చేసుకుంటోంది.......
అప్పుడే వారిలో సగంమంది నిహతులా?
ఇదేమీ ఆత్మరక్షణోపాయం కానేరదు—
కోపపూరితమైన అంధత్వమేగాని!

ఇదు

ఆశయసిద్ధికి శ్రమించడం కానేరదు!
ప్రభుత్వం రాక్షసావేశంతో ప్రజల్ని చంపుతోంది,
అలాంటి ఆవేశంతోనే ఉత్తమాదర్శప్రేరితులు
కూడా సంచరించడం సిగ్గుచేటు కాదా?
బైటనున్న ఆ మనుషులంతా నారక్షణలో ఉన్నారు!
మందికోసం నాచైతన్యాన్ని సైతం
నిశ్శబ్దంలో ముంచడానికి సిద్ధంగా ఉన్నాను.
నేను గొంతెత్తి అరుస్తున్నాను:
ఛిన్నాభిన్నం చేయండి వ్యవస్థని!
కానీ, మీరో విధ్వంసం చేస్తున్నది ప్రజల్ని.
ఉంటలేను, నిశ్శబ్దంగా ఉండలేను!
ఈనాడు శాంతానికి తావులేదు.
ఆఫైదీలు కూడా మానవులే,
ప్రసవబాధతో గిలగిలలాడుతున్న
తల్లుల రక్తంనుంచే, మనలాగే, జన్మించారు—
వాళ్లంతా మనవాళ్లే, మారని మానవసోదరులే!

నామరహితుడు ఆఖరిసారిగా అడుగుతున్నాను:
నిశ్శబ్దంగా ఉంటావా, లేదా కామ్రేడ్!
విజృంభించండి! జలపాతపువేగంతో
విజృంభించండి! ఆలస్యం పనికిరాదు.
దయాభిక్షపెట్టి మన శరీరాన్ని విడువరు వాళ్లు:
ఈ భీభత్స సంగ్రామాన్ని సుహృద్భావాలతో,
పవిత్రమంత్రాలతో జయించలేము—

ఈ ఆడదాని మాటల్నేమీ లెక్కచేయకండి—
అది సహజంగా సంభవించిన సోమరివాగుడు మాత్రమే!

స్త్రీ : ఆపుచేయమని చెబుతున్నాను నేను!
మరి నువ్వు........ఎవరు నువ్వు?
శతాబ్దాలనుంచి బంధించబడ్డ
అధికారవ్యామోహం నిన్నందుకు
పురికొల్పిందా?
ఎవరయ్యా........నువ్వు?
హే భగవాన్....ఎవరయ్యా....నువ్వు?
భక్షకుడివా లేక రక్షకుడివా?
నామరహితుడా, నీ ముఖమేదీ?
నువ్వా................?

నామరహితుడు మహాజనం!

స్త్రీ : ఓ మహాజనులారా!
మీరు దుర్భరంగా కనిపిస్తున్నారు నాకు!
బైటనున్న ప్రజలకి కవచం తొడిగాను.
చాలాకాలంనుండి మీకు నేను సహవాసిని.
నాకన్న ఎక్కువ బాధపడ్డవాళ్లు
మీరేనని నాకు తెలుసు.
అంతఃపురాలలో అసూర్యంపశ్యనై
పెరిగాను నేను; ఆకలి రోకలిపోటులకు
నలగలేదు నాజీవితం; చౌడు దుళ్లి
పడిపోయే గోడల కర్కశధ్వనుల్ని

విన లేదు నా జీవితం ;
అయినప్పటికీ మీమీద నాకు సానుభూతి
ఉంది. మీసంగతి నాకు తెలుసు.
కనకనే మీకోసం—అడుక్కునే పసిపిల్లలాగ
సిగ్గుతో మీదగ్గరకు వచ్చాను.
ఓహో వినండి నామాటలు :
అధర్మాల పునాదులన్నీ ఛిద్రం చేయండి,
రహస్యంగా చుట్టుకొన్న దాస్యశృంఖలాలన్నీ
నేడే విచ్ఛేదం చేయండి. కానీ, శతాబ్దాల
మూర్ఖత్వం పోతలుపోసిన ఉక్కుకత్తుల్ని
దూరంగా విసిరేయండి !
నూతనజీవన విధానాలకోసం—ప్రతీకారకాంక్ష
సాధనయోగ్యం కాదు; ప్రతీకారం—విప్లవం
కానేరదు; స్ఫటికీకృత, సంశోభిత, ప్రకోపిత,
విప్లవ వజ్ర సంకల్పాలను గొడ్డలివలె ఛేధిస్తుంది—
ప్రతీకారం!

నామరహితుడు ఓ వనితా! ఎంతగా సాహసిస్తున్నావు?
నీవర్గపు సహజస్వభావాల్ని విడువలేక,
చావుబ్రతుకుల్ని నిర్ణయించే ఈ ఘడియల్ని
విషపూరితం చేస్తున్నావా?
నీ మాటలలో నాకు వేరొక అర్థం ధ్వనిస్తోంది:
బయటనున్న నీస్నేహితులకు, తొలినాటి సహచరులకు,
రక్షణ కవచం కల్పించావు కాబోలు! అదే

నీ హృదయంలోదాగిన పరమార్థం కాబోలు !
ఎంత కుతంత్రం ! ఎంత మోసం !

[ హాలులోని మంది కోపంగా ఆస్త్రీని చుట్టు ముడతారు. ]

ఒక కేక : ఓహో మేధావి వర్గం !

మరో కేక : ఆమె నక్కడే, గోడకి చేరువగా,
నిలబెట్టండి !
వెంటనే కాల్చి చంపండి !

నామరహితుడు ఖైదీలకు రక్షణ కల్పించవూనడం ఘోరమైన కుట్ర !
తీవ్రాచరణలో వినియోగించాల్సినదీ కాలం,
భీషణసమరం కొనసాగించాల్సినదీ కాలం;
మనకి అనుకూలంగాలేని వాళ్లందరూ,
వ్యతిరేకులన్నమాట నిజం.
మందజనం—జీవించి తీరాలి !

హాలులోని మంది : తప్పనిసరిగా జీవించాలి !

నామరహితుడు నేను నిన్ను బంధిస్తున్నాను !

స్త్రీ : నా స్నేహితులకు.... తొలినాటి నాసహచరులకు....
నేను రక్షణ కల్పించానా ? లేదు, లేదు—
మీకే రక్షణ కవచం తొడుగుతున్నాను !
మీకే,—మీకోసం మీగుండెల తుపాకి—
గుండ్లకు అర్పించే మీకే—రక్షణకల్పిస్తున్నాను.
మనందరి ఆత్మలకే కవచం నిర్మిస్తున్నాను !

మానవజాతికే—సంపూర్ణ శాశ్వతత్వానికే
రక్షణ కవచం కల్పిస్తాను. నన్ను నిరసించే ఉన్మత్తుడా!
నామాటలలో భయాన్ని ఆరోపిస్తున్నావా?
అంత నీచమైన దారులు త్రొక్కేదాన్నికాన్నేను—
నీదెంత అబద్ధం! అబద్ధం!

[ఒక కార్మికుడు హాలులో ప్రవేశిస్తాడు.]

కార్మికుడు : ఒక ఖైదీ అరుస్తున్నాడు, మన స్త్రీ-నాయకి కోసం
మళ్ళీ మళ్ళీ తెగ అరుస్తున్నాడు;

నామరహితుడు అవును, అదిగో నిదర్శనం.

స్త్రీ : మరోసారి....నీ వబద్ధ మాడుతున్నావు....
నన్ను చూడాలని కోరేదెవరు?....ఎవరు?
బహుశా నా భర్త కావచ్చును.
అతనికోసమని మిమ్మల్ని మళ్ళీ ఎప్పుడూ
ద్రోహం చేయను. కాని మిమ్మల్ని మీరే
ద్రోహం చేసుకుంటారు. ఆ విషయంమాత్రం
నాకు స్పష్టంగా తెలుసు.

[నామరహితుడు వేదికవిడిచి, హాలులోని
మందిలో అదృశ్యుడౌతాడు. వెలుప
ల్నించి కార్మికులు వత్తిడి చేస్తారు.]

కార్మికులు : పతనమైపోయింది.

కేకలు : పారిపొండి!
పోరాడండి!

[వెలుపల్నించి విడివిడిగా తుపాకి కాల్పులు వినిపిస్తాయి. కార్మికులు జనసమ్మర్దంతో తలుపులు బిద్దలుకొడుతూంటారు.]

కేకలు : తలుపు ఘడియ బిగించిఉంది !
చెవులపిల్లుల్లాగ వలలో చిక్కారు !

[నిశ్శబ్దం మృత్యువుకోసం నిరీక్షిస్తోంది.]

ఒక కేక : చావడానికా !

[ఎవరో అంతర్జాతీయ గీతం ఆలాపిస్తారు. మిగతావాళ్ళు పాటలో పాల్గొంటారు. ప్రబలంగా.

ఉబ్బెత్తుగా మెషిన్‌గన్నులు జ్వాలలు కక్కుతాయి. గీతం తెగుతుంది; ఒణుకుతూ, మాయమవుతుంది. రంగస్థలంలోని ప్రక్కదార్లు రహదార్లుగా మారుతాయి. రైఫిల్సుతో సైనికులు గోడ గట్టినట్టుగా బారులుతీరి ముఖద్వారాలనుంచి ప్రవేశిస్తారు....]

ఆఫీసరు : ఎదిరించడం నిష్ప్రయోజనం
చేతులెత్తి లొంగిపొండి !
చెపుతున్నాను, చేతులెత్తండి !

[ఒకడు తర్వాత ఒకడుగా నిరాయుధులై చేతులెత్తి నుంచుంటారు.]

ఎక్కడున్నాడు మీ నాయకుడు ?

[ స్త్రీతో ]
చేతులెత్తి స్వాధీనం కావా ?
నువ్వు ఎదురు తిరుగుతావా ?
ఆమె చేతులకు సంకెళ్లు తగిలించండి !

[సైనికులు స్త్రీ చేతులకు సంకెళ్లు వేస్తారు.
రంగస్థలంలో చీకటి వ్యాపిస్తుంది.]

## చిత్రం ఆరు

[ఒక స్వాప్నికజగత్తు.]

దృశ్యం: విశాలమైన స్థలం. మధ్యగా ఒక పంజరం. దానిపై గుండ్రని లైటు వెలుగుతుంది. ఒక ఖైదీ పంజరంలో మోకాళ్లపై కూర్చొని వుంటుంది. (ఆ ఖైదీముఖం స్త్రీ ముఖమే) పంజరం ప్రక్కగా 'మార్గదర్శి' వార్డరు ఆకారంలో నుంచుని వుంటాడు.

ఖైదీ: ఎక్కడున్నాను నేను?

వార్డరు: మానవజీవిత ప్రదర్శనశాలలో.

ఖైదీ: ఏమిటానీడలు?—ఆ నీడల్ని తరిమేయండి!

వార్డరు: ఆ నీడల్ని నీవుమాత్రమే తరుమగలవు.

[ఎక్కణ్నించోగాని, తలలులేని మట్టిరంగు నీడలు ప్రవేశిస్తాయి.]

మొదటి నీడ: నేనెవర్నో ఎరుగుదువా నువ్వు,
నన్ను వధించిన ఓ మనిషీ నన్నెరుగుదువా?
కాల్చి చంపబడ్డవాణ్ని నేనే.

ఖైదీ: ఆ పాపం నాదికాదు.

[ఎక్కణ్ణించో తలలేని మట్టిరంగు నీడలు.]

రెండవ నీడ : నన్ను కూడా నువ్వే
నాశనం చేసివేశావ్.

ఖైదీ : అబద్ధమాడుతున్నావు.

[ఎక్కణ్ణించో మట్టిరంగు మొండాలనీడలు]

మూడవ నీడ : మరి నన్ను కూడా నువ్వే
చంపేశావయ్యా !

నాల్గవ నీడ : నన్ను కూడా.

ఐదవ నీడ : నన్ను కూడా.

ఆరవ నీడ : మరి నన్ను కూడా.

ఖైదీ : వార్డర్ !
ఓ—వార్డర్ !

[వార్డరు నవ్వుతాడు.]

సోనియా : ఈ మహారక్తపాతాన్ని—వాంఛించలేదు నేను.

మొదటి నీడ : కానీ, నోరు మెదపలేదు నువ్వు

రెండవ నీడ : తాణాకచ్చేరీపై దండయాత్ర
సాగుతున్న సమయంలో
నోరు మెదపలేదు నువ్వు.

మూడవ నీడ : ఆయుధాల చోరీ సాగుతున్న సమయంలో
నోరు మెదపలేదు నువ్వు.

నాల్గవ నీడ : విప్లవసమరం సాగుతున్న సమయంలో
నోరు మెదపలేదు నువ్వు.

ఐదవ నీడ : రిజర్వులోని సైనికశ్రేణుల పిలిపించే సమయంలో
నోరు కదపలేదు నువ్వు.

ఆరవ నీడ : నీవే ఈ పాపాలనేరాలకు కారణం.

నీడలన్నీ : నీవే దోషివి.

ఖైదీ : ఇతరులందరూ మరణానికి గురికాకుండా
కాపాడాలని వాంఛించాను.

మొదటి నీడ : ఆత్మవంచన చేసుకుంటావెందుకు,
అంతకుముందే మేం కాల్చి చంపబడ్డాం.

నీడలన్నీ : నీవే మమ్మల్నందర్నీ చంపావు.

ఖైదీ : ఐతే నేనొక—

నీడలు : దోషివి.
ముమ్మాటికి దోషివి!

ఖైదీ : నే.... నే.... దో.... షి.... ని

[నీడలు పారిపోతాయి. ఎక్కడనుంచో బ్యాంకర్లు టాప్-హాట్లతో ప్రవేశం.]

బ్యాంకరు 1 : దోషాలలోని భాగాలు విపరీతధరలకి
అమ్మకానికి సిద్ధంగా ఉన్నాయి.

బ్యాంకరు 2 : దోషాలలోని భాగాలు
ఇకముందు చెల్లనేరవు.

బ్యాంకరు 3 : దోషాల భాగాలలో పెట్టిన మదుపులు,
నిష్ఫలం అన్నమాట ! ఒక్క కాగితం
పీలిక విలువైనా చేయవన్నమాట ?

బ్యాంకర్లు : దోషాలలోని వాటాలు
నష్టాలుక్రింద జమకట్టబడ్డాయి.

[ ఖైదీ కూర్చుంటుంది ]

ఖైదీ : నే.... నే.... దో.... షి.... ని....

[ బ్యాంకర్లు మాయమౌతారు ]

వార్డరు : ఓ అవివేకీ నీకు వివేచనా జ్ఞానం లేదు !
వాళ్లంతా బ్రతికే ఉన్నట్టయితే
కాంచన పీఠంచుట్టూ నాట్యం చేస్తారు;
ఆ పీఠం బలివితర్దిగా వేలకొలది జనాల
రక్తం త్రాగుతుంది, అందులో నువ్వుకూడా ఉంటావు.

ఖైదీ : అవును నేను దోషిని.
మనిషిని కావడమే దోషం.

వార్డరు : మంది జనులు దోషులు.

ఖైదీ : అయితే నేను రెండింతల దోషిని.

వార్డరు : జీవితమంతా ఒకదోషం.

ఖైదీ : అందుకని నాదోషాన్ని సమర్థిస్తావా ?

వార్డరు : ప్రతివాడూ తనబ్రతుకు బ్రతుకుతాడు
ప్రతివాడూ తనచావు చస్తాడు.

చెట్లలాగ పూవులలాగ
మానవులూ మనులుతారు—
నొసటిరాత ననుసరించి పెరుగుతాదు, విరుగుతారు.
సృష్టిరహస్యాల చీకటిలో
మళ్లీ మళ్లీ జరిగే ఆత్మవినాశనంలో
స్వరూపాలు సృజించబడుతున్నాయి.
నీఅంతట నీవే సమాధానం శోధించు!
కాని ఉన్నదిమాత్రమే జీవితం.

[ఎక్కణ్నించో శిక్షితుల దుస్తులతో ఖైదీలు వచ్చి ఈ ఖైదీ చుట్టూ మూగుతారు. వాళ్ల తలలపై కోణం తేరిన టోపీలుంటాయి. వాటికి బంధించబడ్డ నల్లని గుడ్డలు కళ్లవద్ద బెజ్జాలతో ముఖంపై కప్పుతూ వ్రేలాడుతాయి....ప్రతీ ఖైదీ గుండెలమీదా నంబర్లువేసిన బిళ్లలు. మార్పులేని లయితో, శబ్దాలు లేని అడుగులతో, ఆ పంజరానికి చతురస్రంగా నడుస్తారు.]

ఖైదీ : ఎవళ్లు మీరు? సంఖ్యల్లారా! అంకెల్లారా!
ముఖాలు లేవే!—ఎవళ్లమీరు?
ముఖాలు వుండని మందిజనాలా!

ప్రతిధ్వని : (దూరంనుంచి రింగురింగుమంటూ) : మందిజనం....

ఖైదీ : భగవాన్!

ప్రతిధ్వని : (చొచ్చుకువస్తూ) మందిజనం....

[నిశ్శబ్దం మూగుతుంది]

ఖైదీ : (కీచు గొంతుకతో అరుస్తూ) మందిజనం విధినిర్ణేతలు
నిర్దోషులు మందిజనం.

వార్డరు : మనిషి నిర్దోషి.

ఖైదీ : భగవంతుడే దోషి.

ప్రతిధ్వని : (దూరంనుంచి) దోషం—దోషం—దోషం—

వార్డరు : భగవంతుడు నీలోనే ఉన్నాడు.

ఖైదీ : అయితే, నాలోపలి ఈ భగవంతుణ్ని—
జయించి తీరుతాను.

వార్డరు : ఓ పురుగా! భగవంతుని
దూషిస్తావా పాపీ!

ఖైదీ : భగవంతుని దూషిస్తున్నది నేనా?
లేక భగవానే నరజాతిని దూషిస్తున్నాడా?
ఈ న్యాయం, ఈ భయానకం, ఈ దుర్భరదోషం
మానవుణ్ని వేరొక మనిషితో బంధిస్తోంది.
భగవానుడు—ధర్మం సంరక్షించని భగవానుడు,
ఛీ ఛీ నాకెందుకు?—తప్పక దూషిస్తాను!

ప్రతిధ్వని : (దూరం నుంచి) 'ధర్మసంరక్షణార్థం....'

[కవాతు చేస్తున్న ఖైదీలు చప్పున కదల
కుండా ఆగిపోతారు. చేతులు వేగంగా
నిటారుగా పైకెత్తుతారు.]

ఖైదీలు : తప్పక దూషిస్తాం!

[ఖైదీలు నిష్క్రమిస్తారు.]

వార్డరు : మీరు సమస్తాన్నీ విండారు.
పంజరాన్నిప్పుడు విడిచిపెట్టండి—

ఖైదీ : నేను స్వేచ్ఛాజీవినా ?

వార్డరు : అస్వాతంత్ర్యం !
స్వాతంత్ర్యం !

రంగస్థలంలో చీకటి వ్యాపిస్తుంది.

# చిత్రం ఏడు

[ఖైదులోని సెల్లు కనిపిస్తుంది. చిన్న టేబిలు, బెంచీ, ఇనుప మంచం, గోడ లోపల్నుంచి కనిపిస్తుంటాయి. తలుపులు లేని కిటికీ, వెలుతురునుకూడా చొరనీయని దట్టమైన గాజుపలకతో కప్పబడి ఉంటుంది. స్త్రీ టేబిలు దగ్గర కూర్చుని ఉంటుంది.]

స్త్రీ : ఆగస్టు దినాలలో, పండిన గోధుమపొలాలలో
పరుచుకున్న మార్గమా!
శీతల పర్వతశ్రేణులలో
ఉషఃకాల-వాహ్యాళీ!
మధ్యాహ్నపు ఉచ్ఛ్వాసంలో, ఊపిరిలో
గలగల్లాడే ఆకుల సవ్వడి!
ఓ హోహో ప్రపంచమా!

[మెల్లగా స్త్రీ చుట్టూరా నిశ్శబ్దం పరుచుకుంటుంది.]

బిడ్డకొరకు ప్రార్థించానా?

[నిశ్శబ్దం కదులుతుంది.]

ఓ జీవిత సంఘర్షణ ! సమస్తవిచ్ఛేదనమా !
భర్తతోటి బంధించిన జీవితమా !
పరిశ్రమల కతికించిన జీవితమా !
భర్తతోటి — శత్రువుతో....
శత్రువుతోనా ?
శత్రువుతో బంధనమా ?
నాతోనే బంధనమా ?....
అయితే అతనొస్తున్నాడడిగో,
ధైర్యం చిక్కబట్టుకోవాలి నేను !

[ఖైదుగది తాళం తెరువబడుతుంది. భర్త లోనికి ప్రవేశిస్తాడు]

భర్త : నువు కబురంపించావ్.
ఇప్పటికి రాగలిగాను.

స్త్రీ : నాధా !

భర్త : నీకొక సువార్త తెచ్చాను.
నీపేరూ - నాపేరూ, కళంకరహితంగా ఉన్నాయి.
హత్యానేరాల దర్యాప్తులో
తేలింది, నీవు నిర్దోషివని.
త్వరగా ధైర్యం చేకూర్చుకో—నీపై మోపిన
మరణశిక్ష ధృవపడలేదింకా.
ప్రభుత్వానికి వ్యతిరిక్తంగా—నీవొనరించిన
నేరాలన్నిటినీ, వివేకవంతులైన ప్రజలంతా.
సదభిప్రాయాలను మన్నిస్తారు కాబట్టి,
వుత్తమాశయాలుగా గౌర విస్తున్నారు.

స్త్రీ : (లోపల వెక్కి-వెక్కి ఏడుస్తూ) నేనొక నిర్దోషిని....
నిర్దోషపు కోషిని....

భర్త : ఔను, నీవు నిర్దోషివి.
విచక్షణాజ్ఞానం కలవారి
విశ్చయం అదే!

స్త్రీ : విచక్షణా జ్ఞానం గలవారికి!
విలువలేని ముడిసరుకులాంటి నాదుఃఖంలో
అవమానపూరితమైన నిందలు నీపేరుమీద
పడనందుకు సంతోషిస్తున్నానంతే!

భర్త : నేనేనాడో తెలుసుకున్నాను, నీవు నిర్దోషివని

స్త్రీ : అవును, నీకేనాడో తెలుసు....
సదభిప్రాయాలంటే నీకెంతో గౌరవం—
నువ్వెంత గౌరవనీయుడవు
ఇప్పుడుకదా నిన్ను నిర్మలనేత్రంతో చూస్తున్నాను.
ఆయినప్పటికీ నీవే దోషివి—నాథా
నాకన్నా నీదే హత్యానేరం.

భర్త : వనితా, నీకోసం వచ్చానిక్కడికి.
....నీమాటలు ద్వేషం - మంటలు.

స్త్రీ : ద్వేషమా? ద్వేషంకాదది.
నిన్ను మనసారా ప్రేమిస్తున్నాను—నా ఎముకలలో
రక్తంలో గాఢంగా ప్రేమిస్తాను.

భర్త : మంది విషయంలో మరోమారు నా హెచ్చరిక.
మంది జనాల్ని కదిలించడమంటే,
నరకాన్ని కదిలించడమన్నమాటే !

స్త్రీ : నరకమా ? నరకాన్ని సృష్టించినవాళ్లెవళ్లు—
బంగారం పొదిగే మీ మిల్లుల యమ
బాధలనుంచే పుట్టినదాభావం !
ప్రతిరోజూ మీ మర - తిరగలి విసిరి విసిరి
లాభాలను రాలుస్తుందే ! ఈ ఖైదుకొట్లు
కట్టినవారెవ్వరు ? 'పవిత్రయుద్ధ' మ్మని
అరచినవారెవ్వరు ? శతసహస్ర
మానవజీవాలను నిర్దయగా
బలిదానం చేసినవారెవ్వరు ? అంకెలకై
ఆడే జూదంలో పావులుగా ఉపయోగించిన
వారెవ్వరు ? మందిజనాలను మూసలలో
నలిపి నలిపి పోతలుపోసేదెవ్వరు ?
నిన్నటిరోజుల మీ పంకిల భారం
నేటికి సైతం తలకెత్తుటకై చూసేదెవ్వరు ?
వారి ముఖాల సౌందర్యాన్ని—
వారి తమ్ముల ఆనందాన్ని—
బందిపోటు చేసినదెవ్వరు ?
వారిని యంత్రాలుగ మార్చిన దెవ్వరు ?
బ్రతుకుల దౌర్జన్యంగా నీచమ్మొనరిస్తూ
యంత్ర చక్రదంతాల నడుమ పోకచక్కల
మాదిరిగా నములుతున్నదెవ్వరు ?
మీరే !.... మీ ప్రభుత్వమే !

భర్త : నా జీవితమొక విధ్యుక్త ధర్మం.

స్త్రీ : అవును నిజం చెబుతున్నావు,
ధర్మం, విధి-యుక్తం-ధర్మం,—
ప్రభుత్వాజ్ఞల్ని శిరసావహించడం;
అప్పుడు నిజంగా నీవొక గౌరవపాత్రుడివి!
స్పష్టంగా నిన్ను చూడగల్గుతున్నానిప్పుడు....
నీవో! సత్యాలోచనాపరులతో చెప్పు—
మీరంతా అసత్యవాదులని
వాళ్ళంతా దోషులు—మనమంతా దోషులం....
అవును, నేను దోషిని—నా హృదయానికి నేనే
దోష మాచరిస్తున్నాను; మానవాళి
ఎట్టఎదుట దోషం చేస్తున్నాను.

భర్త : నేను నీకోసం వచ్చాను....
న్యాయవిచారణలో నీవిక్కడ కూర్చుంటావా?

స్త్రీ : అవును, ఇక్కడే, న్యాయస్థానం—
తప్పకుండా ఇక్కడికే వస్తుంది.
దోషినీ, న్యాయమూర్తినీ నేనే,
నేరం ఆరోపించి వాదిస్తాను, నేరాల్ని
రుజువుచేసి ప్రకటిస్తాను; విమోచనం
కలిగిస్తాను నేనే....కారణం మన
జీవితాంతంలో ఈ మహాపరాధాల్ని.
దోషాల పాపాల్ని భరించే వాళ్లెవరో
తెలుసుకుంటున్నావా, నువ్వు?....ఓహో!

అవసృకత ప్రారంభించింది మొదలు
మానవుడు కర్తవ్యాని కుద్యుక్తు డవుతున్నాడు.
అతని ప్రతీకార్యమూ, ఎర్రని మానవరక్తంతో
పెరుగుతూనే ఉంది;—మానవుడు జీవించడానికి
అవసరంగా కాంక్షిస్తూనే ఉన్నాడు; అయితే,
రక్తసముద్రా లతనిచుట్టూ వుప్పొంగుతూనే వున్నాయి.
ఓహో! అంతంలో ఈ దోషాలన్నీ మోసే
వాళ్లెవరో వూహిస్తావా ?.... ఏదీ నీ చేతిని
నా కసరా యియ్యి, నారక్తానికి ప్రియతమమైన మనిషీ!
కారణమేమంటే నన్ను నేను జయిస్తున్నాను—
నా వ్యక్తిత్వాన్నీ, నిన్నూ.

[భర్త భయంతో వొణుకుతాడు. ఆలోచ
నలతో అతని ముఖకవళికలు వికా
రంగా మార్తాయి. తొట్రుపడుతూన్న
అడుగులతో నడుస్తాడు.]

స్త్రీ: ఏదీ నీచేతిని అసరా ఇయ్యి,
నీచేతిని నాకిలా ఇయ్యి, నాఅన్నా—
అవును, నీవు నాఅన్నవు కూడా....
త్వరగా.... నీవే.... తప్పని సరిగా
నీ వెళ్లాల్సిన అవసరముంది....
మంచు కప్పిన పొలాలనుంచి
పరుచుకుంది మన అంతిమ మార్గం.
అవసరం లేదీ తుదిదారికి మార్గదర్శి.

ఈ చివరి బాటకు తల్లి లేదు. ఏకాంత
వాసమీ ఆఖరిమార్గం.

[ తలుపులు తెరవబడ్డాయి. నామరహితుడు
ప్రవేశిస్తాడు. ]

నామరహితుడు నీకన్నులు కప్పిన విభ్రాంతి నుంచి
తేరుకొన్నావా ? నీకలల మైకాన్ని
తొలగించుకొన్నావా ? నిశితమైన
కత్తివంటి అపగాహన నీగుండెను చీల్చిందా ?
'మానవాళి' అని, 'నిన్ను నేను క్షమిస్తున్నాను' అని
న్యాయమూర్తి పలికేడా ? ఈపాఠం పరిపక్వమైంది:
హితకరమైనది, నీలో కలిగిన ఈ పరివర్తన
కభినందిస్తున్నాను. మళ్లీ మాదానివి
నేటికి నీవైనావు.

స్త్రీ : ఎవరు నువ్వు ? ఎవరు పంపారు నిన్ను ?

నామరహితుడు మంది జనం.

స్త్రీ : అయితే మరచిపోలేదన్నమాట నన్ను ?
కబురేమని ?—

నామరహితుడు నేను నీకు స్వేచ్ఛను తెచ్చాను.

స్త్రీ : స్వేచ్ఛా ! జీవితమా !
ఇక్కడినుంచి మనం పారిపోవాలా ?
అయితే, ఏర్పాట్లన్నీ జరిపారా ?

నామరహితుడు  ఇద్దరు వార్డర్లకు లంచాలు మేపాం.
మూడోవాణ్ని, నేను వాణ్ని గేటుదగ్గరే
చంపి పారేస్తాను.

స్త్రీ : చంపేస్తావా ?.... నాకోసమేనా ?....

నామరహితుడు  నీకోసం కాదు, ఆశయం కోసం

స్త్రీ : ఒక మనిషి మరణించడం ద్వారా
నా జీవితం లాభం పొందడానికి
నాకేవిధమైన హక్కూ లేదు.

నామరహితుడు  నీమీద మందిజనాల కా హక్కుంది.

స్త్రీ : ఐతే వార్డరుకున్న హక్కుమాటేమిటి ?
వార్డరుకూడా మనిషేకదా మరి !

నామరహితుడు  ఇప్పటి వరకూ మానవులనేవారు లేరు.
ఈ పక్షాన మందికి సంబంధించిన వాళ్లు
ఆ పక్షాన ప్రభుత్వ సిబ్బంది.

స్త్రీ : మానవుడు కావడ మనేది ప్రధానమైనదీ, నిష్కాపట
మైనదీని.

నామరహితుడు  కేవలం మందిమాత్రమే పవిత్రమైనది.

స్త్రీ : మంది పవిత్రమైనదేమీ కాదు.
ఉద్వేగం తయారుచేస్తోంది మందిని.
స్వాయత్తపు అన్యాయం మందిని చేస్తోంది.
అవసరానికి అనాలోచితంగా కట్టుబడే

స్వభావమే మంది. అమాయకత్వమూ,
నీచత్వమూ మాత్రమే మంది లక్షణం;
ప్రతీకారం, క్రూరత్వం మాత్రమే:
మంది జనులు అంధత్వంలో మసిలే బానిసలు.
పవిత్రతను అపేక్షించడం మాత్రమే:
మంది - మట్టేసిన పంటపొలం; అధోలోకం
లో సమాధిచేయబడ్డ శవం.

నామరహితుడు మరి కర్తవ్యం ?

స్త్రీ : కర్తవ్యం కన్నా అధికమైనది
ఈవిధంగా ప్రకటించడం :
స్వేచ్ఛగా విడువండి మందిజనాల మానవత్వాన్ని
స్వేచ్ఛగా విడువండి మందిజనాల కుటుంబాన్ని !

నామరహితుడు సరేలే, బైటి చల్లగాలితో
నీహృదయం కుదుట పడుతుంది.
త్వరగాలే, మనకెంతో వ్యవధిలేదు.

స్త్రీ : నీవు విముక్తివికావు.
నీవు విమోచనం కాదు.
నీవెవ్వరో తెలుసు నాకు.
'చంపి పారేస్తావు !'—అవును నీవు
శాశ్వతంగా చంపి పారేస్తావు.
సమరానికి అనాగరిక పుత్రుడివి నువ్వు;
నువ్వే పాపం—నూత్నధర్మానికి ఉన్నత
నిర్వాహకుడివీ, ఉరితీసే కసాయివాడివీ కూడా—

విమోచనకోసం నీవేర్పరచుకున్న సాంకేతిక
పదాలు రెండే: 'మరణం—నిర్మూలనం' ।
ఎందుకయ్యా మాటల సున్నితమైన మేలిముసుగు ?
తీసి దూరంగా విసిరెయ్యి. అది పుల్లిపొర కాగితం
లాగ నలిగి, విశీర్ణమై పోయింది.

నామరహితుడు ప్రభుత్వం కోసం ఖూనీకోరులైన గొప్పవాళ్లు
పోరాటం సాగిస్తున్నారు ।

స్త్రీ: అవును, వాళ్లు వేడుకకోసం చంపడం
లేదు; మీలాగే ప్రబలమైన ఆదర్శం
పైగల దృఢతర విశ్వాసంతోనే చంపడం ।

నామరహితుడు మనల్ని అధఃపతనం కావిస్తున్న ప్రభుత్వం
కోసం పోరాడుతున్నది సైన్యం —
కానీ మనం మానవాళిక్షేమం
కాంక్షించి తీవ్రంగా పోరాడుతున్నాం.

స్త్రీ: హత్యలు చేస్తారు మీరు ప్రజలందరి కోసం—
వాళ్లు కూడా, మీ ఆరోపణ ప్రకారం
హత్య లొనరించారు తమ ప్రభుత్వం కోసం ।
తమ ప్రభుత్వం వల్లనే—తమ మాతృదేశం
ఘనతవల్లనే యావత్ భూమీ తేజోవంతం
కాగలదని కొందరి బలమైన ఉద్దేశం.
కాని, ఈ రెండు స్వభావాల మధ్యలో
నాకు కించిత్తూ కనిపించదు భేదం ।
వీళ్లు ఒకే ఒక్క దేశం కోసం

హత్యలు చేస్తే—వాళ్లో సమస్తదేశాలకోసం
కావిస్తారు హత్యలు! వీళ్లు వేలాది మనుషులకోసం
హత్యలు చేస్తే—వాళ్లు లక్షలాది జనంకోసం
కావిస్తారు హత్యలు!!
ప్రభుత్వం కోసం
ప్రాణాల్ని తీసేవాళ్లను ఉరితీసే కసాయి—
వాడని అంటారు మీరు, ప్రజలకోసం
ప్రాణాల్ని తీసేవాళ్లను మీరే బడాయిగా
పూల దండలతో అలంకరిస్తారు. విశేషం
ఏమంటే—ఆమనిషి మహానీతిమంతుడనీ,
గౌరవనీయపౌరుడనీ, ఉత్తముడనీ,
మహాత్ముడనీ ముద్దుగా పిలుస్తారు మీరు.
లోకపు గాయాల్ని మాన్పి మరామత్
చేసే సైనికబలమనీ, పవిత్రమైన హింసలనీ—
ఏవేవో సంతృప్తిగా చెప్పుకుంటారు మీరే!

నామరహితుడు వాళ్లందర్నీ నిందించు;
బ్రతుకు భారాన్ని నిందించు;
యజమానులు న్యాయం గలవాళ్లని
నమ్మించి లక్షలాది జనాన్ని
ముంచమంటావా బానిసత్వంలో?
ఏమీ చేయకుండా మౌనం వహిస్తే
తక్కువదా నీదోషం మాత్రం!

స్త్రీ: సైనికబలాల హింసలతో కొడికట్టిన కాగడా
మనకి దారి చూపించదు ముమ్మాటికీ!

మమ్మల్ని మహాద్భుతమైన లోకంలోకి వింతగా
తీసుకు పోతున్నావు నిజంగా—మానవ బానిసత్వం
మూర్తీభవించిన లోకం పాతదనుట తథ్యం :
విధి మిమ్మల్నికాలానికి త్రోసివేసి నప్పటికీ,
నిరాశచెందిన నీరసుల కధికారం అప్పగించే—
కర్తవ్యంతో నిన్ను పంపించినట్టయితే—
స్వాతంత్ర్యప్రదాత అని నిన్ను వారంతా
కీర్తించి నట్టయితే—నీవిధి మానవుణ్ణి—
ద్వేషిస్తుందని చెప్పగలను ఖచ్చితంగా :

నామరహితుడు మంది జనులు పరిగణిస్తారు; మనిషికాదు.
కావు, నీవింక మా నాయకవి కాదు.
జన్మతహా వచ్చే బలహీనతల్ని ప్రతి ఒకరూ
మోసుకొస్తూనే వుంటారు. నీ పుట్టుకతో వచ్చిన
నీవర్గపు అరిలక్షణాల పుట్టుమచ్చల్ని—
బలహీనతలనీ, ఆత్మవంచననీ—
స్పష్టీకరించుకుంటున్నావు పాపం :

స్త్రీ : లేదు, నాకు తెలుసు—నువ్వు
ప్రజల్ని ప్రేమించడం లేదు :

నామరహితుడు మా వాదం మాకు ముఖ్యం—
నేను ప్రజల్ని ప్రేమిస్తున్నాను:
అంటే భవిష్యత్తుని ప్రేమిస్తున్నాను.

స్త్రీ : ప్రజల విషయం ముఖ్యమైనది.
నేటి ప్రజలను మూర్ఖమైన రేపటి
సిద్ధాంతాలకు బలిచేస్తావా ?

నామరహితుడు వాళ్ళత్యాగాన్ని కాంక్షిస్తోంది మా ఆశయం—
కానీ నువ్వు మందికి సలిపావు ద్రోహం :
నీ ఆదర్శానికే చేసుకున్నావు ద్రోహం—
ఈ రోజునే నీవు తేల్చుకోవాలి నిర్ణయం.
ఊగిసలాడే వాళ్ళందరి సహకారం
యజమానులకే లభిస్తుంది కేవలం ;
ఆ యజమానులు మనల్ని క్షామం
తో ఆధోలోకానికి నొక్కేస్తారు నిజం ;
కనకనే ఊగిసలాటంటేనే మాకు విరోధం.

స్త్రీ : నేనొక మనిషి ప్రాణాన్నైనా తీసి వుంటే—
మంది జనాన్ని నేను ద్రోహం చేశానన్నమాటే ;
కార్యాచరణలో నిమగ్నమైనవాళ్ల ఆత్మత్యాగం
చేస్తారు. నామాటవిను: ఎవ్వడికైనా సరే
తన ఆశయంకోసం మనుషుల్ని చంపే అధికారం
ఎప్పుడూ లేదు. చంపే అవసరమే వుంటే
ఏ ఆశయమూ పవిత్రత పొందలేదు. అంటే
మానవ రక్తపాతాన్ని కాంక్షించేవాళ్ళంతా
మహాకాళికలే ; అందుచేతనే దేవుడుకూడా
కాళీస్వరూపమే ; ప్రభుత్వమూ అంతే ;
మందిజనం కూడా మరి అంతే అనాలి.

నామరహితుడు పవిత్రమైన వాళ్ళెవరైతే ?

స్త్రీ : ఒక్క రోజు....
ఒక్క కుటుంబం....

స్వేచ్ఛగల ప్రజలు—స్వేచ్ఛగా ఒకచోట,
గుమికూడి పనిచేసుకుంటారు.
మానవజాతి తన విధుల్ని
నెరవేర్చు కుంటుంది హాయిగా.
పనీ........జనం........

నామరహితుడు  కార్యాచరణలో నిమగ్నమయేందుకు
ధైర్యం చాలడంలేదు నీకు,
కష్టతరమైన కార్యక్రమమది నిజమే.
అలాంటి దుర్భర కార్యకాండ ద్వారానే
నీవన్న స్వేచ్ఛగల ప్రజలవునికి సాధ్యం!
నీ మృత్యువువల్ల సిద్ధిస్తుంది ఆశయం!
బహుశా నీమరణం మాకుపయోగం!

స్త్రీ:  అమరత్వం పొందాన్నేను.
శాశ్వతంగా జీవిస్తాను.

నామరహితుడు  నీజీవితం త్వరలోనే....

[ నామరహితుడు నిష్క్రమిస్తాడు ]

స్త్రీ:  మీరు నిన్న జీవించారు.
మరి నేడు జీవిస్తున్నారు.
రేపేమో మరణిస్తారు.
కాని నేను—
గిరగిరా తిరుగుతూ మళ్లీమళ్లీ
మానవరూపాన్ని అనంతంగా ధరిస్తాను.
దోష రహితంగా నేను—

పవిత్రీకరించేందుకు అవతరిస్తాను.
అమరమైన మానవజాతిగ
ఏర్పడతాను !

(మతగురువు ప్రవేశం)

మతగురువు : నీ జీవిత అంతిమ ఘడియల్లో నేను
ఏమైనా సాయం చేదామని వచ్చాను.
నీకైనప్పటికీ కూడా మతం తన
నిర్వ్యాజ కృపారసాన్ని ప్రసరించ
డానికి ఎప్పుడూ వెనుదీయదు.

స్త్రీ : నిన్ను పంపించిన దెవరు ?

మతగురువు : ప్రభుత్వోద్యోగులు
నియమించారు నన్ను !

స్త్రీ : మరణశిక్ష విధించిన రోజున
నీవేమైపొయ్యావోయ్ ?
ఇప్పుడనవసరం—వెళ్ళిపో !

మతగురువు : నేటికీ భగవంతుడు నిన్ను
క్షమించగలడు. నాకు తెలుసు నీ నేరం.
నీవు కలగన్నావు మానవజాతి మంచిదని—
అంచాతనే పాపం—ప్రభుత్వ భద్రతకీ,
సభ్యతకీ వ్యతిరేకంగా
అసంఖ్యాకమైన పాపాలొనరించావు.
మొదటినుంచీ మానవజాతి జీవిస్తున్నది—
పాపరూపపు నది గర్భంలోనే.

స్త్రీ : మానవజాతి మంచి వైపుకి
తడుము కుంటూ నడుస్తోంది.

మతగురువు : కలికాలపు అబద్ధం అది.
వినాశనంలోంచి, నిరాశలోంచి
పారుబోతుతనంలోంచి—పుట్టిందది.
ఎరువు తెచ్చుకున్న నమ్మకాలమైకం
రక్షిస్తోంది దాన్ని. దుష్టశక్తుల ఆత్మవంచనం
భయపెడుతోంది దాన్ని. విశ్వాసం
ఉంచు నా మాటమీద— ఉన్నతాశయాల
మనుష్యులు ఎప్పుడూ వాంఛించరు దాన్ని!

స్త్రీ : మానవు లున్నతాశయాల కోసం
ఎగబ్రాకుతారు. వాళ్ళ దుష్కర్మలు
కూడా మంచితనపు మేలిముసుగు ధరిస్తాయి.

మతగురువు : ప్రజలు పుడతారు; ప్రజలు నశిస్తారు.
యుగాంత ప్రళయం సంగతి—
పాపం తెలియదు భూమికి.

స్త్రీ : నమ్ముతున్నాను జీవాత్మా!

మతగురువు : మరిచిపోకు; కామక్రోధాలు
అధికార దురాశలూ—ఇవే
జీవితానికి లయలు!

స్త్రీ : నమ్ముతాను లే పరమాత్మా!

మతగురువు : మరిచిపోకు; అనంతమైనది ప్రపంచం !
మార్పులేని మార్పులో ఉన్నది విధానం !
ఎప్పుడూ వుంటుంది మానవజాతి నిస్సహాయస్థితిలో—
పరంజ్యోతి ఒక్కటే దానికి విమోచనం !

స్త్రీ : నేను నమ్ముతాను.
కాని నాకు చలిగా వుంది.
సరే వెళ్లు—తక్షణం వెళ్లిపో !

(మతగురువు నిష్క్రమిస్తాడు. ఆఫీసరు ప్రవేశం)

ఒక ఆఫీసరు : నీమీద చెప్పిన తీర్పు ఇదిగో:
ప్రభుత్వానికి వ్యతిరేకంగా నీ నేరం,
అనివార్య కారణాలవల్ల—
అంగీకరించబడింది ముక్తకంఠంతో !

స్త్రీ : అయితే నన్ను కాల్చి చంపుతారా ?

ఒక ఆఫీసరు : [అధికార పూరితంగా ఆజ్ఞాపిస్తున్న కంఠంతో]
ఆజ్ఞలు—ఆజ్ఞలే !
విధేయత—విధేయతే !
ప్రభుత్వం శ్రేయస్సు :
శాంతీ—భద్రతా.
అదే సోల్జరు కర్తవ్యం కూడా !

స్త్రీ : అయితే మరి మనిషిది ?

ఆఫీసరు : ఏవిధమైన సంభాషణకీ
తావులేదిక్కడ. ఇదేనా ఆజ్ఞ!

స్త్రీ : నేను సిద్ధంగా ఉన్నాను.

[ఆఫీసరు, స్త్రీ, బైటికి వెళ్ళిపోతారు. కొన్ని సెకన్ల వరకూ రంగస్థలం ఖాళీగా ఉంటుంది. ఇద్దరు స్త్రీ ఖైదీలు—కాన్విక్ట దుస్తులలో మెల్లగా ప్రవేశించి తలుపు ప్రక్కగా నుంచుంటారు]

స్త్రీఖైదీ ఒకటి: నీవు ఆఫీసర్ని చూశావా?
అబ్బ!—బంగారంలా మెరుస్తు
న్నాయతని బట్టలు. అవునా!

స్త్రీఖైదీ రెండు: శవపేటికను చూశాను స్నానాలగదిలో
పసుపుపచ్చగా మెరుస్తోందా పెట్టె!

[ఖైదీ ఒకటి టేబిలుమీద రొట్టె ముక్క చూస్తుంది. గబుక్కున దుమికి దాన్ని తీసుకుంటుంది.]

స్త్రీఖైదీ ఒకటి: అదిగో అక్కడ వుందీ రొట్టె!
నా కడుపులో మంటలు రేపుతోంది ఆకలి!!
ఆకలి! ఆకలి!!

స్త్రీఖైదీ రెండు: అబ్బా నాకూ పెట్టే రొట్టె ముక్క!
నాకూ ఆకలి వేస్తుందే!

స్త్రీఖైదీ ఒకటి: అదిగోనే అద్దం!
ఎంత అందంగా వుందో!
దాచేయి త్వరగా—
సాయంత్రం నా కొప్లో....

స్త్రీఖైదీ రెండు: సిల్కు రుమాలు—!
నప్పులేని రొమ్ముమీద సిల్కు రుమాలు!
దాచేయి త్వరగా—
సాయంత్రం నా కొప్లో....

[పటువుగా ధ్వనేదో ఖైదుకొట్లోకి ఉప్పెనలా వచ్చి పడుతుంది. ఖైదీలు చేతుల్ని విశాలంగా చాపుతూ ఊపుతారు. భయంతో కంపిస్తారు. మొదటిఖైదీ తొందరగా తన జేబులోంచి అద్దం పైకి తీస్తుంది. టేబిలుమీద పడేస్తుంది. మోకాళ్ళపై చతికిలపడి వెక్కి వెక్కి ఏడుస్తుంది]

స్త్రీఖైదీ ఒకటి: అయ్యో—అక్కా! మనమిలాంటి పనులు
ఎందుకు చేశామే—అబ్బా!

[ఆమె చేతులు తీవ్రమైన నిరాశతో శూన్యంలో పొర దాపున వ్రేలాడతాయి. రెండవ ఖైదీ తనజేబులోంచి సిల్కు రుమాలు తీసి తొందరగా టేబిలుమీదికి విసిరేస్తుంది.]

ఖైదీ రెండు: చెల్లీ! మన మిలాంటి పనులు
ఎందుకు చేస్తాం—అయ్యో!

[కూలిపోతుంది రెండవ ఖైదీ కుప్పగా.
దాచుకుంటుంది ఒడిలో రసముద్ర.
వ్యాపిస్తుంది రంగస్థలంలో చీకటి.]

[ సమాప్తి ]